REG. No. 757

శ్రీ

# అభినవసరస్వతి

యనునొక మాసపత్రిక

అష్టావధాని. జానపాటి పట్టాభిరామశాస్త్రిచే

బ్రచురింపబడుచున్నది.

గుంటూరుజిల్లా, పల్నాడుతాలూకా, జానపాడు.

సంపుటము 6 } 1914 సెప్టెంబరు. { సంచిక 9

విషయములు.





చందానిర్ణయము సంవత్సరమునకు

ప్రధానపోషకులకు రు 25 0 0 సహాయులకు రు 5 0 0

పోషకులకు రు 10 0 0 చందాదారులకు 2 0 0

చంద్రికా ముద్రాక్షరశాల, గుంటూరు.

Printed at the Chandrik·1 Press, Guntur
and Published at Janapadu, by the Editor Ashtavadhani
Janapati Pattabhir‹ 11‹1 Sastry.

---

ఈ నెల సొమ్ము చెల్లించిన చందాదారులు.

1 లంకా నాగయ్యగారు పెదకొదమగుంట్ల.
2 పుచ్చా పట్టాభిరామయ్యగారు, అసిస్టాంటుకరణము, తుమ్మలచెరువు
3 [illegible]వెంకటేశ్వర్లుగారు, చీరాల
4 యీకోటయ్యగారు. (ప్లీను క్లర్కు, బెజవాడ.)
5 భాగవతుల గోపాలకృష్ణయ్యగారు, కృష్ణాయీష్టరిన్ సబ్ డివిజనా
6 గొట్టిపాటి చెంచుసుబ్బారాయుడుగారు, వకీలు, నరసారావుపేట.
7 గుంటుపల్లి అనంతరామయ్యగారు, టీచరు, గుంటూరు.
8 జంధ్యాల సుబ్రహ్మణ్యశాస్త్రిగారు. నాగవరం.
9 వెలికేపల్లి రామచంద్రయ్యగారు, శతావధాని, యేలూరు.
10 రాచకొండ శివన్న సోమయాజులుగారు, చమళ్లమూడి.
11 కొప్పరాజు గురుచంద్రశేఖరావుగారు, ఫారెస్టుగార్డు, కొండవీడు.
12 శ్రీగిరిరాజు రాఘవయ్యగారు, గుండ్లపల్లి.
13 ఘడియారం వెంకటశివశాస్త్రిగారు, సంగంజాగర్లమూడి.
14 కొండపల్లి సుందరరామయ్యగారు, కరణము, వేమవరం.
15 జానపాటి వెంకటప్పయ్యగారు, డిటో

# అభినవసరస్వతి


సంపుట 6. జానపాడు ఆనంద సం॥ భాద్రపదమాసము సంచిక 9.


శ్రీమత్పరదేవతాయైనమః.

## ఘోషా

పద్మనాయకసోదరులారా!

సుమారు రెండువర్షములకు మున్ను ఘోషావిషయమై తెనుఁగు వార్తాపత్రికలలో చాలభాగముః చర్చింపఁబడినది. నేఁడుతిరిగి ఘోషా యెప్పుడు మనహిందూదేశమునకు వచ్చినదియు, దానిలాభాలాభంబులును దానిపూర్వప్రస్తుతస్థితిగతులను బద్మనాయకసోదరులకు నేనెఱిఁగినంతవఱకు వ్యక్తీకరించుటలోఁ దప్పులేదని వ్రాయఁబూనిన యీ దిగువ వ్యాసము సావధానచేతస్కులై నిష్పక్షపాతబుద్ధి విమర్శింపం బ్రార్థితులు.

ఈఘోషాశబ్దము తొలుత నేభాషలోనిదో విచారింతము. మహమ్మదీయపరిపాలనకుం బూర్వమందున్న మనయాంధ్రగ్రంథము లందెందును బొడకట్టకపోగా మహమ్మదీయపరిపాలనానంతరము వెలువడిన గ్రంథములందైనను నొకటరెంట నిటీవలగ్రంథములం దక్క నీ ఘోషాశబ్దమే లేనందువల్లను, ఏయాంధ్ర నిఘంటువునంగూడఁ గానరానికారణములంబట్టియును, పండితవరేణ్యులవలననిది యాంధ్రశబ్దముకాదని యెఱుఁగుటచేతను ఇది హిందూస్థానీశబ్దమో కాక "ఘోష"అను మనసంస్కృతశబ్దమునుండి యీఘోషాఘోష విచారించి యెవ్వరేని జనింపంజేసినదియో యైయుండనోపునని నాయభిప్రాయము. ఇది మహమ్మదీయశబ్దమనియు రానురాను తెనుంగున వ్యవహరింపఁబడుచున్నదనుటయు నిక్కము. పైకారణముననేమి

యీఘోషా దురాచారము మహమ్మదీయపరిపాలనకు లోఁబడని దేశముల లేకపోవుటచేనేమి, యిదినిశ్చయముగ మహమ్మదీయపరిపాలన కాలముననే స్థాపింపఁబడినదని యూహింపనయ్యెడి. అట్లైనచో బ్రాహ్మణేతర జాతులందు లేని యీయాచారము మనయందే యేలనుండవలయు. బ్రాహ్మణేతర జాతులు మాత్రము మహమ్మదీయ పరిపాలనకు లోఁబడలేదాయని శంకింపరుగదా! ప్రతాపరుద్రుని నాఁడేమనకుల మున్నతస్థితిఁగాంచెనని యనేకగ్రంథమ్ములు ఘోషించుచున్నవి. ఆయననాఁడేమిమహమ్మదీయ పరిపాలకులకడనుండియేమి, అసమాన పౌరుష శాలురై అప్పటప్పటి రాజులకు కృపాపాత్రులై సంపాదించిన జమీందారీలిప్పటికిని సాగుచున్నందునను ఘోషాగలవారు ధనవంతులైన నిర్వహించుకొనుట కష్టకార్యము కాదుగనుకనూ ఎప్పటికప్పుడే యెవరికివారే యిదియనాదియమని భ్రమించుటవలనను లేక యెవరికేని ఘోషాతొలఁగించు తలఁపులుండినను ముదిరినది యసాధ్యమనుకొనుటవల్లనో ఏమోతల్లిదండ్రి తాతలనాఁటి యాచారమునేఁడేల త్రోలగింపవలెననియో మిన్నకుండుటచేత నప్పటినుండి నింతవఱకు జరుగుబాటుకులముగా వచ్చుచున్నందున మనకులమనుమడియందు మహమ్మదీయ పరిపాలకులవల్ల నీ ఘోషావిత్తునాటంబడి మొలకెత్తి కలిమియొసంగు మహాదోహదమువలననచిరంబునం బెద్దదై పూర్వాచారపరాయణజనాదరణమున ప్రమాకై ప్రస్తుతము నవనాగరికపద్మనాయక వ్యాసఝుఁఝూనిలంబునకుంగూడదుస్సాధ్యమైనిరాఘాటంబుగ వర్ధిల్లుచుఁబ్రపంచకజ్ఞానవిహీనతవిద్యాశూన్యత దరిద్రత మొదలుగాఁగల యనేకవిధవిషఫలముః లొసంగుచున్నయది. ఇప్పుడుమనలజూచికమ్మవారు మొదలుగాగల ధనవంతులెందఱెందఱో తమస్త్రీలఘోషాలోనుంచినఘనమనికాబోలు యీదురాచారమవలంబించిమోసపోవుచున్నారు బ్రాహ్మణేతరకులములందు ఘోషా నశించుట పద్మనాయక కులముకన్న పేదఱికముననుండుటయేకాక మహమ్మదీయుల వలన బాధతొ

లఁగుటయుఁగూడనని తలంపవచ్చును. బ్రాహ్మణులు విద్యాగంధము కలవారగుటం జేసియు,నీదురాచార భూరుహనిర్మూలనము లేఁదనము లోనే కావింపఁబడియుండవచ్చును. పూర్వీకులు మహమ్మదీయ దౌర్జన్యమునకు వెఱచియే యీఘోషా నవలంబించిరి కాని నేఁటి పద్మనాయక శిఖామణులట్లుగాక పూర్వు లభిప్రాయముంగనిపెట్టలేక నీయాచారము పద్మనాయక స్త్రీలువ్యభిచారులుకాకుంటకే యని భ్రమించుచున్నారు. ఈ నావ్రాత నిరాధారముకాదు. కొందఱుపద్మనాయకులుతమ స్త్రీలను గదులలోనుంచి తాళము వేయుదురట! కౌపీనముధరించు పురుషుఁడుకూడా నా స్త్రీలను జూడరాదట! ఏమినాగరికత! ఇటువంటివి మనకుమన స్త్రీలయెడలగలయ విశ్వాసము బోధించుననిమాసోదరులేల నూహింపరాదు.చంద్రమతి యాదిగాగలసాధ్వీమతల్లులనిట్టి నిర్బంధనమున నునుచుటంబట్టియే కాఁబోలు పతివ్రతలైరి.ముందువచ్చిన చెవులుకన్న వెనుకవచ్చిన కొమ్ములే ఘనమైనట్టుల పూర్వమునుండి లేక నడుమప్రాపించిన యిది యెంతఘనమై నీల్గుచున్నది.ఒరులలెక్క సేయకున్నది. ఈదురాచారమెన్నెన్ని యనవసరాభీష్టములఁ గోరుచున్నది. అయ్యారే!నడమంత్రపుకల్మియర్ధరాత్రమునంగొడుగుగోరుననునుడివిశ్వాసయోగ్యము. మొత్తముమీఁద నీకుల మితరకులముకన్న జారత్వమున లక్షరెట్లు తక్కువగుటకు హేతువు ఘోషాకాదు. మన స్త్రీలు విద్యను గొంతకాకున్నంగొంతైన నేర్చితీరుటయే ఇతరకులములకన్న మనకులమున స్త్రీవిద్యయెక్కువగుటయే దీనికింగారణంబు.అనేకమంది పద్మనాయకసహోదరులునాతోబ్రసంగవశమున మనకీయాచారముండుటంబట్టియే సాటికులములకన్న మనకుల మెక్కువగౌరవంబుగ నున్నయదియనిరి. మనకులమునకు గౌరవంబు మొన్న మొన్న రీతింగాన్పించు బొబ్బిలీయుద్ధంబుననేమి యింకను నితరయుద్ధంబులనేమి మనవారవక్రవిక్రమవిహారమున బేరుగాంచుటచేతను జోలిమాలినపనులఁబైఁబెట్టుకొని పదిమందిచేఁ బదిమాటలఁబడెడువారుకానందునను పైఁజెప్పి

నకారణములవల్లఁగల్గిన మన స్త్రీల పాతివ్రత్యవిశేషమునల్లను మొట్ట మొదటినుండియు మనకులము ధనవంతమైనదగుటవలనను ఎదుటవారి కిగౌరవంబొసంగి తాము గౌరవంబందెడువారగుటను లభించియున్నది కాని ఘోషావల్లనకాదు. కాదుకాదు ఘోషా గౌరవమును దెచ్చు నంట. అకటా ఇది యెంతయనాలోచనీయమైనమాట. ఇప్పుడిప్పుడు ఘోషా నవలంబించుచున్న కమ్మవారు మొదలగు ధనికులును ఘోషాలేని బ్రాహ్మణేతరులకన్న గౌరవనీయులే! రేపొక నిమ్నజా తివాఁడెవఁడేని తనయాఁడంగుల ఘోషాలోనుంచినంతనే ఘోషాలేని జాతివారకన్న వాఁడును వాని స్త్రీలును గౌరవనీయులగా! అయ్యో! ఇదెక్కడన్యాయము? ఈఘోషావలన మన నిర్మలహృదయులగు స్త్రీలయందు నిష్కారణానుమానమార్జించుటేకాని గౌరవమును దెచ్చు టకాదు. స్త్రీసంఘసంస్కరణ కదిసనది. ధనవ్యయమూ మితిమీఱు గౌరవమా శూన్యము. ప్రపంచజ్ఞానమా కలుగనీయదు. లాభమా పూజ్యము. సౌఖ్యమా! మాలెక్కకుఁగాన నీదురాచారము వర్జనీయము. విసర్జనీయమనినంతనే మనస్త్రీలను హూణాంగనలరీతిని స్వేచ్ఛతో బజారులలోఁ బ్రతిపురుషుని భుజమునకు రాచుకొని తిరుగమని నాయ భిప్రాయముకాదు. ఈవిషయములో నేను 1914 సంవత్సరము యే ప్రియల్ ముప్పదవతేదీ గురువార మాంధ్రపత్రికలో ఘోషాపద్ధతి అనుశీర్షికక్రింద వ్యాసమువ్రాసిన "చె. సీ"గారి యభిప్రాయముతో నేకీభవించుచున్నాను. అవసరమైనఁబడఁపడి యుచ్చటవిస్తరించెదను. ఇంకొక్కవిశేషము. ఘోషావైవాహికములందును, సంగరరంగ ములను. రాజకార్యసదనంబులను మినహాయింపఁట. ఇదివరకు హిత వాదిగారు సెలవిచ్చిరి. ఇప్పుడు పుణ్యక్షేత్రసందర్శన సమయములలో గూడ ఘోషా మినహాయింపైనది. దీనికి నానేత్రేంద్రియములేకాక స్త్రీలతోసహా క్షేత్రములకుం దయచేసిన ప్రతిసామాన్యపద్మనాయక సోదరుల హృదయములును సప్రమాణములు. ఈసోదెయేల ప్రస్తుత

ము వెంకటగిరి బొబ్బిలి పిఠాపురం రాజా లట్టిగొప్పవారి కిందప్ప సాధారణపద్మనాయకులకు సమయమువచ్చినప్పుడెల్ల ఘోషా మినహాయింపే. అదివారికింపేకాని ఘోషాతొలగించుడన్న కంపు. మఱచితి చిన్నయుదాహరణము. నేనునామిత్రులగు నొక పద్మనాయకునితో నాకుఁగల పిచ్చిపట్టుదలను వారియందు నాకుంగల చనువు పెంపునను "ఘోషా యేలతీసివేయ రాదు" అని నేననఁగా అసాధ్యమగుటంబట్టి మ్రింగ లేకపోయిరి కాని వారియుద్దేశ్యమట్టిదని నాయట్టిమందమతియు నూహింపం గలఁడనుటలో నతిశయోక్తి లేదు. సరే ఇదిట్లయినకొన్నాళ్ళకు పైఁజెప్పఁబడినమిత్రుని సతిరజకుని కడనుండి వస్త్రంబులఁగైకొంట నామిత్రుండును బంధువుండును షుమారు పదునేడేడుల ప్రాయంపువారుచూచి మేలముగా నిదేమివింత మీరేమిచాకివానివద్దనుంచి తెల్లబట్టలందుకొను టేమియనఁగా "ఏమిసేయుమనిమొదరు బాబూబీదవాండ్రకు మాకెక్కడినుంచివస్తారు నౌకరులని" రంట! కంటిరా మా "ఘోషా" ఘోష అయ్యోప్రమాదము. ఆస్త్రీ వస్త్రంబులందుకొనుచు నాబంధువునిఁజూచి లజ్జించితటాలున లేచి లోనికి చనిరంట యంటమఱచితిని కట్టా! ఇట్టిస్థితిమంతులకుఁగూడ ఘోషాయేటికి. ఇట్టిసగము ఘోషా యవలంబించి సాధారణస్థితిమంతులు భయభ్రష్టులైచూచువారికి "రెంటికిం జెడిన రేవడు" సంగతి జ్ఞప్తికిందెప్పింపంగనేలా! అవలంబించినచో ఘోషా వెంకటగిరి బొబ్బిలి పిఠాపురము సంస్థానములరీతి సాగించుకొనవలెను. అనగా అట్టివారికుండినసులోటు విశేషములు లేవు లేకున్న వదలివేయంగవలయుగాని పైరీతిఘోషా యవలంబించి అగట్టు పదుగురునోటంబడ్డ తలవంచుకొనుకదువిచారము 1912 సంవత్సరము సెప్టెంబరునాల్గవ తేది ఆంధ్రప్రకాశికలో "ఘోషాపద్ధతిమంచిదా" అనుశీర్షికక్రింద వ్యాసమును వ్రాయించినసార్థకనాములగు సత్యవాదిగారు "పేరుగొప్ప ఊరుదిబ్బ" అనుసామెతను సార్థకముచేయుచున్నవారు. ఘోషాపద్ధతి నవలంబించకూడదని నామ

తము,, అను అభిప్రాయమే నాకునుసమ్మతము. ఇంతమాత్రమున ధనవంతులు ఘోషా నవలంబించవలయునని నాతలంపుకాదు ధనవంలతుకుఁ గూడ ఘోషా పద్ధతివలన నష్టములు ఇబ్బందులు కలవు కాని ధనహీనులకన్నఁ జాలభాగము తక్కువని మాత్రము చెప్పకతప్పదు. 1912 సంవత్సరమునఁ జరిగినయీ ఘోషావిషయికమగు చర్చలో వ్యాసములు వ్రాయించిన వారిలోఁ బెక్కుపేరులతోడఁ బరగిన మ॥ రా॥ రా॥ శ్రీ హితవాదిగారుతప్పఁ దదితరు లందఱు నాలో నేకీభవించిరి. అనఁగా మహారాజశ్రీ ఆర్. రామారావుగారున్నూ, పద్మనాయక కులజులున్నూ ఘోషాయందు నష్టములు కలవనిచెప్పిరి. మహారాజశ్రీ మేకా వెంకటాద్ర్యప్పారావుగారున్నూ సత్యవాదిగారున్నూ ఘోషా విసర్జనీయమనియే సెలవిచ్చిరి. మహారాజశ్రీ హితవాదిగారు మాత్రము ఘోషా స్త్రీ వ్యభిచారాభివృద్ధికిం గారణంబగునని నేవ్రాసితినని దురభిప్రాయ పూరపూరిత చేతస్కులై బంధుబూతులం బత్రికాముఖమునఁ బ్రకటించిరి. నేనటు వ్రాయనేలేదు. ఒకవేళ వ్రాసితినే యనుకొనుఁడయినను వారంతకోపింపక నన్ క్షమియించి యింకను నేను ఘోషా తీసివేయుఁడని చెప్పిన కారణములకైనను బద్ధులుకారైరి. పోనిండు నేఁడైనను మాపై వారు కిన్కఁజంపి దయనింపుదురుగాక. నేనప్పుడు స్త్రీబుద్ధికి ఘోషా యడ్డుపడదంటిని. అదియిప్పటికిని ఘంటానాదముగా నిరూఢి చేయుచున్నాను. ముందుఁజేయఁగలను. ఉన్నమాటంటినా పద్మనాయక సహోదరులకు నాపై నలుకవలదు. తప్పున్న దిద్ది యొప్పఁజెప్పుఁడు. మా చిరకాలమిత్రులకు మాత్రము పై ప్రార్థనలకుగూడా మనసుకలుగదు. వారు నాపేర్విన్న మండిపడుదురు. ఏదో ప్రచురింతురు. అట్టి నిరర్థకమైన విమర్శనముల ఖండించుచు మా యమూల్యమగు కాలమును వృథపుచ్చుమనియు వ్రాతలంగాక చేతలనే వారికిదివరకేజవాబు లిచ్చుట యైనదనియుమనవిచేసుకొనుచున్నాఁడ. కోపింపకుఁడు. శాం

తింపుడు. అయినను జరిగిపోయినదానిఁ జెల్లగింపనేల! గతజలసేతుబంధన మేటికి! కాన ప్రస్తుతాంశమునే విచారింతము. స్వయంవరమందుఁగాని, యుద్ధమందుఁగాని, మరియొకొక దానియందుఁగాని ఘోషామినహాయింపను టకసలీఘోషాయాచారమె శాస్త్రమందు వచింపంబడినయదో అందే ఘట్టమున నీనినహాయింపుపద్దులు పెద్దలుసెలవిచ్చిరో తెలియకున్నది. మొదలు మనస్త్రీలకు స్వయంవరములుగాని యుద్ధంబులుగాని కనుపట్టవు. ఈయాచారద్వయము క్షత్రియులకుండెడివి. పోనిండు మనము క్షత్రియులమందురా! జందెమేదీ! పూజాపురస్కారములేవీ! క్షత్రియులు చెడి వెలమలైరి కనుక పైనవచించినవి నశించెనందురా! ఆచారములన్నియు నశించి కులభ్రష్టులైనవారికి ఘోషాయాచారమొకటిమాత్రము మిగిలెనా! ప్రప్రథమమున మరియొకటి క్షత్రియులకు ఘోషాలేనట్లు భారతరామాయణాదులు ప్రమాణములు. ఇదిట్లుంచుడు. మనపద్మనాయకచరిత్రలో మనము క్షత్రియులమైనట్లు కానుపింపదు. సచ్ఛూద్రులమనికలదు. అయినచో నీయాచారమెచ్చటిది. ఈశూద్రులకు పూర్వము అనగా మహమ్మదీయులకుఁ బూర్వమునుండి ఘోషాకలదా! అట్లొప్పింపఁగల మాన్యులు కలరా! ఇంతయెందుకు? ఏ పురాణమందుఁగాని యేనాటకమందుగాని యేచరిత్రయందుగాని యే పూర్వగ్రంథమునఁగాని హిందువులలో నేకులమునఁగూడ ఘోషాయున్నట్టులం గనుపట్టకపోవగా నెందుఁజూచినను అంతఃపురస్త్రీలనువాక్యమేకలదుగాని ఘోషాస్త్రీయని కనఁబడకపోవుటంబట్టి మహమ్మదీయ పరిపాలనకుఁ బూర్వమీయాచారము మనకుఁగానిమరియింకే ఆంధ్రకులమునకుఁగానికలదని గ్రంథాధార మణుమాత్రము గోచరింపదు. తురుష్కదౌర్జన్య నివారణార్థమై యేర్పఱుపఁబడిన యీఘోషాయాచారము హూణశకమునఁగూడ విడువకుంట కడువిచార్యము. అప్పటి స్థితిగతులఁబట్టి మానసంరక్షణార్థం బవలంబించిన నవలంబించితిమికాక, పులియు మేకయు నొక్కరేవున నీరుద్రాగుచున్న యీపరిపాలన

మునఁగూడ మనకీ ఘోష యేటికి పొరపాటు "ఘోషా యేటికి!" పద్మనాయక వెలమసోదరు లూహింతురుగాక. 1912 సంవత్సరమున నీ ఘోషాయాచార మనాదియమేయని మాపై కాల్దువ్వి అంకెలఁ బెట్టినహితవాదిగారు. "అంతఃపుర స్త్రీ" యను ఘోషా స్త్రీయు నొకటేయని భ్రమించి తనవాదమున కనుకూలమని వారనుకొని కొన్ని పురాణోపమానములం గనఁబఱచిరి కాని వానిని మహారాజశ్రీ రాజా మేకా వెంకటాద్ర్యప్పరావుబహదూరు వారిచేతను నాచేతను సంపూర్తిగ సకారణంబుగ నప్పుడే ఖండింపఁబడి పత్రికాముఖమున "నంతఃపుర స్త్రీ ఘోషా స్త్రీ" భేదాభేదములమాహితవాదిగారికి విన్నవించుకొనియుండుటం జేసి యిప్పుడు తిరిగి "అంతఃపుర స్త్రీ" ని గుఱించి చెప్పుట పిష్టపేషణము వదలివేయఁబడినది. ఇవియన్నియు నిట్లుండుచుండు. ఘోషామనకనాదియాచారమేయని భావింపుఁడు. మనము క్షత్రియసంతతిలోనివారమేయని యనుకొనుఁడు. వెండియు తమయిష్టమువచ్చినవన్నియు ననాదియమనియు శాస్త్రీయమనియు నాచరణీయమనియు ననుకొనుఁడు. కాని స్త్రీని యితరపురుషులను జూడనీయకఁబోయినఁ బోయితిమికాక తమ్ముఁడుభార్య అన్నకంటఁబడఁగూడదనికాని సతితనపతిని స్వకుటుంబీకులయెదుట నని దర్శించరాదనికానియెచ్చటనేనికలదా! ఈయాచారమనాదియమేనా! ఇదియేకులము దేనిఁగంటిమా! ఇంత ఘోరమా! అక్కాంతకన్నులు తనభర్తను జూచుకోరానంతటి పాపంబుగావించెనా! భర్తనుజూచినఁదప్పైపనోగాక భర్తనామోచ్చారణముగూడ సలుపరాదఁట కటకటా! సతితనప్రాణాధారభూతుండును తనసుఖదుఃఖములరెంటనుపాలుఁగైకొనువాఁడును. తనకుదండ్రియైనను, దల్లియైనను గురువైనను, దైవమైనను మఱేమియైనను వాఁడే యనఁదగినవాఁడును సమస్తపురోహితభూసుర బంధుమిత్ర సమూహంబునకగ్నిసాక్షిగంగైకొన్న మనోనాథునోరారస్మరించుచు కన్నారవీక్షించి జన్మసాఫల్యంబొందకుంట పాపహేతువుకాదా! ఇదియనాదియమేనా! సశా

శ్రేయమేనా! సదాచారమేనా! సర్వజనాదరణీయమేనా! పుణ్యప్రదమే
నా! వర్ణనీయమేనా! ఘోనిండీయాచారములుకూడ ననాదియనుని
యుఁ బురాణసమ్మతమనియుఁ దలంతుము అంతమాత్రముననే మనము
ట్లు నడుచుకోవలసినదేనా! ఎన్ని వేలయేండ్లక్రిందటనో యున్న యాం
చారముల ప్రకారము వర్తించవలసినదేనా! ద్వాపరయుగమున్న భర్త
చనిపోయిన వంశోద్ధారణార్థము బావగారితో సంతానమును బడసి
రని కలకాలము నట్లాచరింపవలసినదేనా! అదిసమంజసమేనా! తగినపని
యేనా! ప్రపంచకమాగునా! ఇంతయేందుకు పూర్వము మనవారుహరి
జనులనంటినను స్నానముం జేసెడివారు. ఇప్పుడుమనమెల్లరము గౌరవించు
చుంటిమా! తొల్లిబ్రాండెలవాక్కాయల నుపయోగించిరి. నేఁడుసూట్లు
రాలేదా. ఆనాఁడు తిరుమణితిరుచూర్ణపు బొట్టుం బెట్టకుండిన తప్పు
యీనాఁడట్లుపెట్టిన నాక్షేపణకాలేదా! నేనివియన్నియునొకరినాక్షే
పించుటకుకాదు. ఆచారములు కాలానుగుణముగ మారవలసియుండు
ననియెద. ఎవ్విధమునఁజూచినను ఘోషావిసర్జనీయము, ఎన్నాళ్ళక్రింద
టనో జరిగినయీచర్చ తిరిగి పెల్లగించుటకు గారణంబేమన ఆనాఁడు
మేము వ్యాసములవ్రాయ నవివాహితుల మాటలపాటింపమనిహితవా
దిగారు నిరసనభావ మగుపఱచుటవల్ల వివాహితుఁడనయి అనుభవజ్ఞు
డనయి వ్రాసితిని.   పూర్వపుహితవాదిగారికివిజ్ఞప్తి.

ఉ॥ తిట్టుటకట్టిపెట్టుఁడు సుధీజనవాక్యల నిశ్చయంబుగ
నెట్టుడు భార్తృభావములనిల్పుడు ।మూపయిఁదప్పులున్నఁ జూ
పెట్టుఁడు మందలింపుఁడు నవీనప్రపంచపు ధర్మమెంచి మా
పట్టున రండు వేగ హితవాదులిఁకన్ తమపట్టువీడుచున్.

సీ॥ మా వెంకటాద్రిప్పరావు భూపాలుని
న్యాయైకవాక్యంబులాత్మనెంచి
ఉన్నసమాచార మున్నట్లువ్రాసిన
నలసత్యవాదిపల్కులఁ దలంచి

తులలేనిబంధుబూతుల వ్రాయకన హేతు
కరమగు న్యావ్రాతపరిగణించి
కలవు ఘోషావల్ల కష్టమ్ములని పత్రి
కలనన్న వారి వ్రాతలఁబఠించి
న్యాయమూహించి సజ్జనులౌననంగ
భరతమాతృలాభార్థంబు పాటుపడుచు
పద్మనాయక బ్రాతలపైన నిర్దుష్టి
వదలినిల్పుకొనుము "హితవాదిపేరు"

విమర్శకులకొక్క-విన్నపము:—

పేరులందాచుకొని యొక్కఁడే పదిపేరులతో విమర్శించి బహు జనాభిప్రాయము మాదైనదనుకొనక దల్లిదండ్రులిడిన **నామంబులతో** దూషణలేకుండ విమర్శించుట యోగ్యము. సజ్జనానందకరము. చదువు వారికి వ్రాయువారికిఁ బేరుఁ దేఁగలదు.

గంపలగూడెము.
11—8—14

సర్వజన విధేయుఁడు,
కే. వి. కృష్ణారావు.

శ్లో॥ మార్గావర్తితపాదుకా పశుపతే రంగస్య కూర్చాయతే
గండూషాంబునిషేచనం పురరిపో ర్దివ్యాభిషేకాయతే
కించిద్భక్షితమాంసశేషకబళం నవ్యోపహారాయతే
భక్తిః కింనకరో త్యహో వనచరో భక్తావతంసాయతే॥

చ॥ పలుమఱుదారిఁద్రొక్కఁబడుపాదుక నీశ్వరుకూర్చమట్లుగా
నలిపెను, పుక్కిలించినవిషంబున స్నానముగూరిచెన్, వన
స్థలచరుఁ జేసె భక్తవరు,చర్వణగా నవశిష్టమైన దు
ష్పల మూపహారతన్ నిలిపె, భక్తియొనర్పనిదేది యారయన్॥ 63

శ్లో॥ వక్షస్తాడనమంతకస్య కఠినాపస్మారసమ్మర్దనం
భూభృత్పర్యటనం నమత్సురశిరఃకోటీరసంఘర్షణం
కర్మేదం మృదులస్య తావకపదద్వంద్వస్య గౌరీపతే!
మచ్చేతోమణిపాదుకావిహరణం శంభో! సదాంగీకురు॥

చ॥ శమనునిఱొమ్ముఁదన్నుటను శైలముమీఁదను సంచరించుటన్
విమలనమస్కృదామరపవిత్రశిరోమకుటప్రఘర్షణ
క్రమమునఁ జేసి నీ చరణకంజము లెంతెయునొచ్చె, పార్వతీ
రమణ! మదీయచిత్తమణిరాజతపాదుకలందు నిల్పుమా॥ 64

శ్లో॥ వక్షస్తాడనశంకయా విచలితో వైవస్వతో,నిర్జరాః
కోటీరోజ్జ్వలరత్నదీపకళికానీరాజనం కుర్వతే
దృష్ట్వా ముక్తివధూ స్తనోతి నిభృతాశ్లేషం భవానీపతే!
యచ్చేత స్తవపాదపద్మభజనం తస్యేహ కిందుర్లభం॥

ఉ॥ కాలుఁడుభీతిఁజెందు,సురకాండము మస్తకిరీటకోటిర
త్నాళినివాళినిచ్చు,ముదమందఁగముక్తిసతీకుచద్వయిన్
లీలగనుండఁగల్గును,త్రినేత్ర!భవచ్చరణాబ్జభక్తినం
శీలుని కెద్దిదుర్లభము?చేకుఱునన్నియుఁ గోరినట్టులన్॥ 65

శ్లో॥ క్రీడార్థంసృజసిప్రపంచమఖిలం క్రీడామృగా స్తేజనాః
యత్కర్మాచరితంమయాచ భవతఃప్రీత్యైభవ త్యేవ తత్

శంభో!స్వస్యకుతూహలస్యకరణం మచ్చేష్టితంనిశ్చితం
తస్మా న్మామకరక్షణంపశుపతే!కర్తవ్యమేవ త్వయా ॥
ఉ॥ విశ్వముస్సృష్టిఁజేసితివి వేడుక నాడుకొనందలంచి వి
శ్వేశ్వర!యస్మదాదిజన మింపుగనీకు విలాసజంతువుల్
శశ్వదిదంమదాచరితసత్క్రియలెల్లను దద్ధితార్థ మో
యీశ్వర!దానఁజేసి ననునేలుటనీకు నవశ్యకార్యమా॥ 66
శ్లో॥ బహువిధపరితోష బాష్పపూర స్ఫురపులకాంకితచారుభోగభూమిం
చిరపదఫలకాంక్షిసేవ్యమానాం పరమసదాశివభావనాం ప్రపద్యే ॥
మ॥ అమితానందరసప్రవాహపులకాంకారూఢసద్భక్తికు
త్తమభోగాకము సత్యమైనపద మందంగోరు సద్రాజిచే
త మదిన్ సేవ్యము నైన శంభుపరమాత్మధ్యానముం జేతు ని
త్యము నన్ గింవిధబాధలొందనటు లాధన్యుండు రక్షింపఁగన్॥ 67
శ్లో॥ అమితముదమృతం ముహుర్దుహంతీం
విమలభవత్పదగోష్ఠ మావసంతీం
సదయ! పశుపతే! సుపుణ్యపాకాం
మమపరిపాలయ భక్తిధేను మేకాం॥
మ॥ వరసంతోషపయస్స్రవంబును భవత్పాదాబ్జగోష్ఠాంతరో
ద్ధురసంచారముఁ బుణ్యపాకమును నై దోషోజ్ఝితంబాచు నీ
ధరణిం బెంపగు భక్తిగోవొకటి నాదండం బ్రవేశించె నో
పరమాత్మా! దయతోడ నప్పశుమణిం బాలింపఁగం జూడుమా॥68
శ్లో॥ జడతా పశుతా కళంకితా కుటిలచరత్వంచ నాస్తిమయి దేవ!
అస్తియదిరాజమౌళే! భవదాభరణస్య నాస్తికిం పాత్రం॥
మ॥ జలభావంబు పశుత్వముం గుటిలసంచారంబు చిహ్నంబునుం
గల బాలేందుని మౌళిఁ బూనితివి, జోకన్ నాయెడన్ లేవు త
త్తలభావంబులు, కల్గియుండినను నోకాత్యాయనీనాథ! యా
లలితోద్భావణతాప్తికర్హుఁడను నేలాకాను వాక్రువ్వుమా॥69

శ్లో॥ అరహసిరహసి స్వతంత్రబుద్ధ్యా పరివసితుం సులభః ప్రసన్నమూర్తిః
అగణితఫలదాయకః ప్రభుర్మే జగదధికో హృది రాజశేఖరోస్తి॥

ఆ॥ బాహ్యమందు మదిని బహుళస్వతంత్రత
నుపచరించుటకును యోగ్యుఁడగుచు
భూరిఫలదుఁ డఖిలభువనాధికుండునౌ
రాజశేఖరుఁడు విరాజిలె మది॥ 70

శ్లో॥ ఆరూఢభక్తిగుణకుంచితభావచాప
యుక్తైః శ్శివస్మరణబాణగణైరమోఘైః
నిర్జిత్య కిల్బిషరిపూన్ విజయీ సుధీంద్రః
సానందమావహతి సుస్థిరరాజ్యలక్ష్మీం॥

ఉ॥ భక్తిగుణాన వంచఁబడు భావధనుస్సుననుండి సూటిగా
ముక్తములౌ శివస్మరణపుంశరపంక్తులఁ బాపశత్రులన్
శక్తతమై జయించి వడి సాంద్రపుసుస్థిరరాజ్యలక్ష్మినిన్
వ్యక్తతఁబొందుచుండెడిని హర్షముతోడ సుధీంద్రుఁ డెంతయున్॥

శ్లో॥ ధ్యానాంజనేన సమవేక్ష్య తమఃప్రదేశం
భిత్వా మహాబలిభిరీశ్వరనామమంత్రైః
దివ్యాశ్రితం భుజగభూషణ ముద్వహంతి
యే పాదపద్మమిహ తే శివ! తే కృతార్థాః॥

తే॥ చూచి ధ్యానాంజనంబున శూలినామ
మంత్రబలులను ద్రవ్వి తమఃప్రదేశ
మమరసేవితమగు శివునంఘ్రియుగము
ననుభవించెడివారె కృతార్థు లరయ॥ 72

శ్లో॥ భూదారతాముదవహద్యదపేక్షయా శ్రీ
భూదార ఏవ కిమతస్సుమతే! లభస్వ
కేదారమాకలితముక్తిమహౌషధీనాం
పాదారవిందభజనం పరమేశ్వరస్య॥

ఉ॥ భావనసేయ నేవిధినిబద్ధదశాత్ముఁడె తొల్లి సూకరే
డ్భావమునొంది ముక్తికి నివాసమునాఁదగు పార్వతీశప
జ్జీవనజాతముల్ గొలిచెఁ జిత్తమచంచలముంబొనర్చి నీ
వావిధి నిత్యముల్ హరుపదాబ్జము లోసుమతీ! భజించుమా॥

శ్లో॥ ఆశాపాశక్లేశదుర్వాసనాదిభేదోద్యుక్తై ర్దివ్యగంధై రమందైః
ఆశాశాటీకస్యపాదారవిందం చేతఃపేటీం వాసితాం మే తనోతు॥

ఉ॥ మాటికి నాహరిద్వసను మాన్యపదాబ్జము లొలి నాదు హృ
త్పేటికనుంచుకొన్న నటఁ బెంపునుజెంది దురాశపేరిఁటన్॥
నూటిగనుండు పాశపు నశుద్ధపుగంధములన్ హరించి వే
మేటును వాసనల్ గలిగి మించఁగఁజేయదె యద్ది యారయన్॥ 74

శ్లో॥ కల్యాణినం సరసచిత్రగతిం సవేగం
సర్వేంగితజ్ఞ మనఘం ధ్రువలక్షణాఢ్యం
చేతస్తురంగ మధిరుహ్య చరస్మరారే!
నేతస్సమస్తజగతాం వృషభాధిరూఢ!

శా॥ గోరాడ్వాహన!సర్వచిత్రగతులం గొర్కు ల్విడంబించుచున్
రారాజచ్ఛుభలక్షణాన్వితమునై రంజిల్లు మన్మానసో
దారాశ్వంబునఁగూరుచుండి హరిదంతంబు ల్మహోల్లాసమిం
పారన్ సంచరణంబుసేయు మఖిలబ్రహ్మాండనాథా!హరా!॥ 75

శ్లో॥ భక్తి ర్మహేశపదపుష్కరమావసంతీ
కాదంబినీవ కురుతే పరితోషవర్షం
సంపూరితో భవతి యస్య మనస్తటాక
స్తజ్జన్మసస్య మఖిలం సఫలంచ నాన్యత్॥

తే॥ శివుపదంబనునింగిని జేరిభక్తి
కురియఁబరితోషవర్షంబు శరదమటుల
నేరిహృదయతటాకంబు పూరితమగు
వారిజననంపుఁబైరు ఫలవంతమగును॥ 76

నేకోనవింశంబున ధ్యానంబును వింశాధ్యాయంబున సమాధివిధియు నుం జెప్పంబడియె, ముక్తిఖండంబునందలి తొమ్మిదియధ్యాయములం దుఁ బ్రథమాధ్యాయంబున ముక్తి ముక్త్యుపాయ మోచక మోచక ప్రద చతుర్విధప్రశ్నయు ద్వితీయంబున ముక్తిభేదనకథనంబును దృతీ యంబున ముక్త్యుపాయకథనంబును జతుర్థంబున మోచకకథనంబును బంచమంబున మోచకప్రదనిరూపణంబును షష్ఠమంబున జ్ఞానోత్పత్తి కథనంబును సప్తమంబున గురుశుశ్రూషామహిమయు నష్టమంబున వ్యాఘ్రపురంబున దేవతల కుపదేశంబును నవమంబున నీశ్వరనృత్తదర్శ నంబును గలిగియుండు, యజ్ఞవైభవఖండంపుఁ బూర్వభాగంబునందలి నలుబదేడధ్యాయంబులందుఁ బ్రథమాధ్యాయంబున సర్వవేదాంతార్థ ప్రశ్నయు ద్వితీయంబునఁ బరాపర వేదార్థవిచారంబును దృతీయంబు నఁ గర్మయజ్ఞవైభవంబును జతుర్థంబున వాచకయజ్ఞప్రశంసయుఁ బం చమంబునఁ బ్రణవవిచారంబును షష్ఠమంబున గాయత్రీప్రపంచంబును సప్తమంబున నాత్మమంత్రంబును నష్టమంబున షడక్షరవిచారంబును నవమంబున ధ్యానయజ్ఞంబును దశమంబున జ్ఞానయజ్ఞంబును నేకాద శాది పంచాధ్యాయపర్యంతంబు జ్ఞానయజ్ఞవివేకంబులును షోడశా ధ్యాయంబున జ్ఞానోత్పత్తికారణంబును సప్తదశంబున వైరాగ్యంబు ను నష్టాదశంబున నిత్యవస్తువిచారంబును నేకోనవింశంబున సాక్షిస్వ రూప నిత్యవస్తుకథనంబును వింశంబున విశిష్టధర్మవిచారంబును నేక వింశంబున ముక్తిసాధనవిచారంబును ద్వావింశంబున మార్గప్రామా ణ్యలక్షణంబును త్రయోవింశంబున శంకరప్రసాదంబును జతుర్వింశపంచవింశంబులఁ బ్రసాదవైభవంబును షడ్వింశంబున శివభక్తివిచారంబును సప్తవింశంబునఁ బరమపదస్వరూ పవిచారంబును నష్టావింశంబున శివలింగస్వరూప కథనంబును నేకోన త్రింశంబున శివస్థానవిచారంబును త్రింశంబున భస్మధారణావైభవం బును నేకత్రింశంబున శివప్రీతికరంబగు జీవబ్రహ్మైక్యవిచారంబును

ద్వాత్రింశంబున భక్త్యభావకారణంబును త్రయస్త్రింశంబునఁ బరత
త్వనామవిచారంబును జతుస్త్రింశంబున మహాదేవప్రసాదకారణంబు
ను బంచత్రింశంబున సంప్రదాయవిచారంబును షట్త్రింశంబున సద్యో
ముక్తికరక్షేత్రమహిమయు సప్తత్రింశంబునముక్త్యుపాయవిచారంబును
నష్టత్రింశంబున ముక్తిసాధనవిచారంబును నేకోనచత్వారింశంబున
వేదములకవిరోధంబును జత్వారింశంబున సర్వసిద్ధికర కర్మవిచారం
బును నేకచత్వారింశంబునఁ బాతకవిచారంబును ద్విచత్వారింశంబునఁ
బ్రాయశ్చిత్తవిచారంబును ద్రిచత్వారింశంబునఁ బాపశుద్ధ్యుపాయం
బును జతుశ్చత్వారింశంబున ద్రవ్యశుద్ధియుఁ బంచచత్వారింశంబున
నభక్ష్యనివృత్తియు షట్చత్వారింశంబున మృత్యుసూచకంబును సప్త
చత్వారింశంబున నవసిష్టపాపకథనంబును గలిగియుండు నింక నుత్తర
భాగంబునందలి యిరువదధ్యాయంబులందుఁ బ్రథమాధ్యాయంబున
బ్రహ్మగీతయు ద్వితీయాధ్యాయంబున వేదార్థవిచారంబును దృతీయా
ధ్యాయంబున సాక్షిశివస్వరూపకథనంబును జతుర్థాధ్యాయంబున సాక్ష్య
స్తిత్వకథనంబును బంచమంబున నాదేశకథనంబును షష్ఠమంబున దహ
రోపాసనయు సప్తమంబున వస్తుస్వరూపవిచారంబును నష్టమంబునఁ
దత్వవేదనవిధియును నవమంబున నానందస్వరూపకథనంబును దశమం
బున నాత్మకుబ్రహ్మత్వప్రతిపాదనంబును నేకాదశంబున బ్రహ్మకు
సర్వశరీరస్థితియును ద్వాదశంబున శివునకహంప్రత్యయాశ్రయత్వంబును
త్రయోదశంబున సూతగీతయును జతుర్దశంబున నాత్మచేనైనసృష్టి
యుఁ బంచదశంబున సామాన్యసృష్టియు షోడశంబున విశేషసృష్టి
యు సప్తదశంబున నాత్మస్వరూపకథనంబును నష్టాదశంబున సర్వశా
స్త్రార్థసంగ్రహంబును నేకోనవింశంబున రహస్యవిచారంబును వింశం
బున సర్వవేదాంతసంగ్రహంబును గలిగిన సర్వవేదాంతసారంబగు ని
మ్మహాపురాణసంహితకు సాక్షాత్పరబ్రహ్మంబగు దక్షిణామూర్తి దేవు
గృతీశ్వరుం గావించితి.

—షష్ఠ్యంతములు—

కం॥ ముద్రాపుస్తకపాణికి। క్షుద్రాపస్మారహరణ శుంభన్మతికిన్
విద్రావితాఖిలాఘో। న్నిద్రాకృతికఖిలయోగనిష్ఠాగతికిన్॥ 63
కం॥ సర్వోగ్రశమనపక్షో। ఖర్వోర్వీభృద్వినాశకరణక్రీడా
దుర్వారపాదభిదురున। కర్వాచీనాత్మమూర్తి కఖిలాకృతికిన్॥ 64
కం॥ అక్షీణదక్షజాను। ప్రక్షేపితవామపాదపంకేజునకున్
గుక్షిస్థాఖిలవిష్టప। రక్షణవీథీప్రచారరమ్యాకృతికిన్॥ 65
కం॥ న్యగ్రోధమూలనిలయున। కుగ్రున కుగ్రేక్షణోదితోద్యద్దహనా
వ్యగ్రార్చినిహితమన్మథు। కగ్రాహ్యసుఖానుభావుకద్వైతునకున్॥
కం॥ శ్రీకరవరకోలగాని కు। లాకరమణి కోటయాంఖ్యలలితమనోంభో
జాకరమిహిరునకు బుధా। స్తోకస్తుతదక్షిణాస్యశుభనామునకున్॥
వ॥ అంకితంబుగా నాయొనర్పంబూనిన స్కాందపురాణోక్త సూత
సంహితామహాప్రబంధంబునకుఁ గథావిధానం బెట్టిదనిన, 68

గ్రంథావతరణము.

ఉ॥ నైమిశసన్నివాసులు ఘనప్రియచిత్తులు మౌనిచంద్రు లీ
శామలభక్తు నాగతు మహాత్ముని సర్వపురాణసత్కథా
స్తోమవిశారదున్ విగతదోషుని సూతుని బూజచేసి "ని
ష్కామభవత్సమాఖ్యగల సంహితఁ జెప్పు" మటంచు వేడినన్॥ 69
ఉ॥ అంతట సర్వదాయి నిఖిలాత్మ మహాత్ముని దేవదేవునిన్
జింతయొనర్చి వ్యాసు మదిఁ జేర్చి సమాహితచిత్తవృత్తి న
త్యంతముతుష్టినొంది సవిధస్థితమౌనులకుం దయాయుత
స్వాంతమునం ద్రయీసదృశసంహితఁ జెప్పఁగఁ బూనె సూతుఁడున్॥
సీ॥ బ్రాహ్మంబు పాద్మంబు వైష్ణవ శైవముల్
వరభవిష్య ద్భాగవతసమాఖ్య
ములు నారదీయంబు కలితమార్కండేయ
మాగ్నేయనామకం బవల బ్రహ్మ

శైవ వైష్ణవ లింగవిఖ్యాత వారాహముల్
స్కాంద వామన కూర్మసంజ్ఞికములు
మాత్స్య గారుడములు మహిని బ్రహ్మాండంబు
ననఁ గ్రమంబునఁ బదునెనిమిదగును
లలిఁ బురాణంబులివి చతుర్లక్షగ్రంధ
సంఖ్యయగు కామికాదికసర్వతంత్ర
మునకు శివుఁబోలెఁ గర్తయౌమునివరుండు
వ్యాసుఁ డింతకు సంతతాభ్యాసులార!॥ 71

వ॥ మఱియు నీయష్టాదశపురాణంబులు సాత్యవతేయు వలనవిని మునీంద్రు లుపపురాణంబులుగల్పించి రవియెయ్యవియనిన సనత్కుమార నారసింహ స్కాంద శివధర్మ దూర్వాస నారదీయ కాపిల వామ నౌశన బ్రహ్మాండ వారుణ కాళీ వశిష్ఠ వాసిష్ఠ లింగ మాహేశ్వర సాంబ సౌర పారాశర మరీచి భార్గవాభిధానంబుల నవగ్రంధలక్ష లక్షితంబై వింశతిపురాణంబు లమరు నివ్వింటిలోన సర్వవిజ్ఞాన సారంబగు స్కాందంబు శ్రుతిసమ్మితంబగు నదియు నాఱుసంహితలు పంచాశతఖండంబులు గలిగి లక్షగ్రంధంబగుఁ గ్రమంబున సనత్కుమారసంహిత యేబదియైదువేలును సూతసంహిత యాఱువేలును శంకరసంహిత ముప్పదివేలును వైష్ణవసంహిత యైదువేలును బ్రాహ్మసంహిత మూఁడువేలును సౌరసంహిత యొక్కవేయి కూడ లక్షసంఖ్యయగు, స్కాందపురాణంబునందు సర్వపాపనాశనియును దేవమునిపూజితయును నతిశోభనయు సాక్షాన్మోక్షదయును వేదసమానయును నతిపవిత్రయును నగు సూతసంహిత నాల్గుఖండంబులగు నందుఁ బ్రథమంబగు శివమాహాత్మ్యఖండం బేడునూఱుశ్లోకంబులును ద్వితీయంబగు జ్ఞానయోగఖండం బేడునూఱులమీఁద ముప్పదేడుశ్లోకంబులును దృతీయంబగు ముక్తిఖండం బెనూటయిఱువదిశ్లోకంబులు నుజతుర్థంబగు యజ్ఞవైభవఖండంబు పూర్వోత్తరభాగంబులఁ జతుస్స

హస్రశ్లోకంబులును గూడ నాలుగువేలశ్లోకంబులుజెలువొందు నిందు ఖండచతుష్టయంబు లోనఁ బ్రథమఖండంబునకుఁ బదమూఁడధ్యాయం బులును ద్వితీయఖండంబునకు నిరువదియధ్యాయంబులును దృతీయ ఖండంబునకుఁ దొమ్మిది యధ్యాయంబులును జతుర్థఖండంబునకు ని రువదియేడధ్యాయంబులును నిట్లు చతుఃఖండమండితయై వేదార్థస్వ రూపయై శ్రుతిసమ్మితయై విరాజిల్లు నీసూతసంహిత సర్వోత్తమయ గు, వేదవిదుండగువాఁడు సర్గ ప్రతిసర్గ వంశ మన్వంతర వంశాను చరితంబులను బంచలక్షణంబులుగల పురాణంబర్థపూర్వకంబుగా నె ఱింగనేని వానిఁజూచి వేదంబులు తమయర్థంబుప్రకటించునితండని భయంబునొందు నితిహాసపురాణంబుల వేదార్థంబెపలుకంబడు, మొదల వేదంబులు స్వతంత్రంబుగాఁ బ్రమాణంబులగు వేదవిరోధంబుగా స్మృతి పురాణభారతోపపురాణబహుశాస్త్రంబులు క్రమంబుగాఁ బ్రమాణం బులగు నేకస్వరూపంబులగు వేదవేదాంతార్థంబులు మునులచే శాఖా భేదంబులచే నింపఁబడె, మఱియు స్వరూపంబున నొక్కటయ్యును దేవ దేవుండగు నప్పరమేశ్వరుమాయచేత వేదంబును వేదార్థంబును వేదవై భవంబు ననంతంబైయొప్పుచు నమ్మహేశ్వరుండు ము న్నజునిసృజించి యాత్మస్థితంబులగువేదంబులొసంగిన విరించియు మహాదేవప్రసాదం బున శ్రుతులుస్మరించి వశిష్ఠునకొసంగె నమ్మునివలనఁ గ్రమంబుగా శక్తి పరాశర సాత్యవతేయులు గ్రహించి రందు విశ్వజగన్నాథుండ గు విష్ణుండు శివాజ్ఞ మద్గురుండైన వ్యాసుండై జనియించె నమ్ముని యంబికాపతియగు దేవదేవుప్రసాదంబున వేదంబుల సంక్షేపించి క్రమం బుగా నేకవింశత్యేకశత సహస్ర నవసంఖ్యాభేదంబుల ఋగ్యజుస్సా మాథర్వణంబులనఁ జతుర్విధంబులుగా వ్యస్తంబుసేయుటవలన వ్యా సుండనునామంబుగాంచి సర్వజ్ఞుండును నీశ్వరుండును మహాయోగియు ను భగవంతుండును మద్గురుండునగు వ్యాసుండు మహాశ్చర్యంబగు భారతంబు నిర్మించె నమ్మహాముని పైలాదిశిష్యచతుష్టయంబునకు

విభేదితంబైన వేదంబొసంగ వారివలన బ్రాహ్మణులెఱింగి రిందువలన వర్ణాశ్రమాచారంబు ప్రవృత్తంబయ్యె నమ్ముని పురాణవక్తగా నన్ను యోజించుటం దిదర్థంబు నాకతివిశదంబయ్యె నదియు మీకుం దెలిపెద, మీర లత్యంతశ్రద్ధావధానంబున వినవలయు" ననిన నైమిశీయులగు నమ్మహామునీంద్రు లంతట॥ 72

తే॥ సూతు విజ్ఞానయోగసమేతు భక్తిఁ
బూజలొనరించి మ్రొక్కిరఁ పుణ్యపురుషు
నంబికాధీశు జగదీశు నాత్మమయుని
ధ్యానమొనరించి పరవశత్వంబు నొందె॥ 73

క॥ పరమాకాశపదంబగు
పరమేశునియందుమనసు పరవశమైనన్
బరమార్థవిదుండుసూతుఁడు
పరమానందంబునను బ్రపంచముమఱచెన్॥ 74

వ॥ ఇట్లుకొంతసేపుండి యంతఁ దెలివొంది యిట్లనిస్తుతియించె॥

తే॥ సోమ!రుద్ర!మహాదేవ!శూలపాణి!
బ్రహ్మవిష్ణ్వాదిసేవిత!భక్తిగమ్య!
విద్వదాత్మస్వరూపక!విశ్వసాక్షి!
స్వానుభూతిద!మోక్షద శర్వ!నీకు॥ 76

◆ పాశుపతవ్రతము ◆

క॥ ఈరీతిభక్తవత్సలు!సారకృపాంభోధి శివుని సంస్తుతి భక్తిన్
వారకనలిపెడిసూతుని!జేరిమహామునులు ప్రశ్నఁజేసిరి వేడ్కన్॥77

తే॥ "జీవుఁ డజ్ఞుఁడు జడతానుభావ ప్రకృతి
హేతువులుగా రదెవ్వనిచేతఁగలిగె
నశ్వరంబైనజగము మహేశ్వరాఖ్యుఁ
డన్యుఁడొక్కఁడుగలిగిన నానతిమ్ము"॥ 78

వ॥ అనిన సూతుండిట్లనియె॥ 79

ఉ॥ సారసలోచనా ద్యమరసంఘము మున్నొకవేళ నీజగ
త్కారణ మెవ్వఁడోయని సుఖప్రదమైతగు రుద్రలోకముం
జేరి నుతింపఁగా శివుఁ డజేయుఁడు రుద్రుఁ డదృష్టపూర్వసా
కారత ముందటన్ నిలువఁగా హరిముఖ్యసురల్ వినమ్రులై॥ 80

ఉ॥ "ఎవ్వఁడవీ" వటన్న జగదీశుఁడు రుద్రుఁడు పల్కె నేనపో
యివ్విధ ముఖ్యదేవతల నీజగముం సృజియించి మేటినై
యవ్వలఁ దత్త్వజాలముల కన్నిటికిం బరతత్త్వమౌచు నేఁ
డివ్విధి గానుపించితిని, నేనొకరుండ యథేచ్ఛనుండెదన్॥ 81

శా॥ నాకంటెం బరుఁడొక్కరుండు కలఁడా? నామాయచేఁగల్గెనీ
లోకంబుల్ సచరాచరంబు లిటులాలోకింప నామాయకున్
నాకున్ భేదము లేదు, నన్నుఁగను నాపూర్ణయోక్తి నాచార్య సు
శ్లోకుం జేరిన జీవుఁ డంతట ముముక్షుండౌచు ముక్తుండగున్॥ 82

గీ॥ ఇట్లుపల్కి మహారుద్రుఁ డేమిచెప్ప
స్వస్వరూపంబులోఁ జేర సర్వసురలు
భవునిగనలేక తా రూర్ధ్వబాహులగుచు
బ్రణుతిచేసి రథర్వశిర స్స్తవమున॥ 83

తే॥ మఱియుఁ బంచాక్షరిని మహామంత్రసమితి
సూక్ష్మమార్గంబులను శివస్తుతులొనర్చి
యగ్నిహోత్రసముత్పన్నమైన భస్మ
మాదరంబున నొకపాత్రయందునిలిపి॥ 84

తే॥ అంబువులఁగడ్గి పాదకరంబులమరు
లమలభక్తి ద్విరాచమనము నొనర్చి
మహిమ నపవిత్రులగుచు "నోమాప" యనెడి
మంత్రమున జలాధ్యుక్షు సోమార్ధమౌళి॥ 85

క॥ ధ్యానంబుఁ జేసి భస్మము। మానితజలములనుదడిపి మఱి జాబాలా
నూనమహామంత్రంబుల। మానక "యగ్నిరితి" యనెడిమంత్రావళిచేన్॥

క॥ మంత్రించియంతభస్మము। మంత్రాత్మకురుద్రుఁడుశివునుమాతరుణీ స్వా
తంత్రగతులమతిఁదగ ని। స్తంత్రధ్యానంబుచేసి తద్దయుభక్తిన్॥ 87

వ॥ మఱియు నిత్యంబును బ్రహ్మభూతంబును పావనంబును
నైన భస్మంబు పాదతలమస్తకోద్ధూళనంబుచేసి లలాటహృదయకు
క్షిదోర్ద్వయాదిస్థలంబుల మూర్తిత్రయాత్మకంబగు త్రిపుండ్రంబుధరి
యించి యథర్వశిరస్థితంబగు వ్రతంబాచరించి దేవతలు శాంతి
దాంతి విరక్తపరితులై హృదయపద్మకర్ణికామధ్యంబున వాలాగ్ర
మాత్రుండును జాతవేదస్వరూపియునగు విశ్వేశ్వరు ధ్యానంబుఁజేసి
సర్వజ్ఞుండును సర్వకర్తయు సమస్తాధారుండును నమృతుండును నగు
మహేశ్వరుఁ బ్రణవంబునఁబూజించుసమయంబునఁ దత్ప్రణవలయంబి
దాకాశంబునఁ బశుపతియగుపరమేశ్వరుండు పొడసూపె నంత, 88

సీ॥ పటుజటామకుటాగ్రఘటితేందురేఖశో
వామభాగాశ్రితవామశోభ
నీలనీరదకాంతి నీలకంఠముశోభఁ
గటిధృతగజచర్మపటముశోభ
మందహాసవిలాససుందరాస్యముశోభ
రమణీయసర్పహారములశోభ
విమలపాండురవర్ణవృషవాహనముశోభ
నతమునిప్రమథగణాళిశోభ
బ్రహ్మవిష్ణ్వాదిదేవతోపాస్యమైన
నిత్యనిర్మలసద్గుణనిర్వికార
పరచిదాకాశరూపమౌ బ్రహ్మమపుడు
వారికుపదేశమొసఁగ నాకారమయ్యె॥ 89

శా॥ వేదాంతంబుల నేస్వరూపముబుధుల్ వీక్షింతురాసాక్షిగా
వేదాచారవిహీను లేపరము లో వీక్షింపఁగా లేరొ యా
నాదాంతస్థితమైనబ్రహ్మము మహానందంబుగూర్పం గుణా
స్వాదంబైకనుపట్టె విష్ణుముఖదేవానీకమధ్యంబునన్॥ 90

క॥ దండధరచండధామా।ఖండపరాక్రమముతోడఁ గాండౌఘము భూ
మండలవల్లభుమేనన్।నిండారగనాటునేసె నిర్జరు లడలన్॥ 165

ఆ॥ మరలజమునిచూపుధరఁగొనుతూపుల
నాగ్రహమున నృపునివిగ్రహంబు
గరిమఁదూఱనేసె నురువడిఁబాములు
పుట్టలోకినేగుపోల్కిఁ దోడ॥ 166

వ॥ ఇట్లేసి సింహనాదంబుచేసిన నవ్వసుంధరామండలాఖండలుండు దండతాడితపుండరీకప్రచండంబుడంబునన్ గండుమిగిలి బెండు పడక॥ 167

శా॥ ఆస్ఫోటించి ప్రచండదావదహనవ్యాభీలకీలాచ్ఛటా
ప్రస్ఫీతేక్షణలీలఁబోల్చి నిబిడద్రాఘిష్ఠమౌర్వీప్రభూ
తస్ఫారారవపూరితోర్వీధరమాద్యత్కుంభిరాట్కర్ణుఁడై
విస్ఫూర్జత్స్ఫుటవిస్ఫులింగచయముల్ వే కన్నులంగ్రమ్మఁగన్॥ 168

వ॥ విజృంభించి॥ 169

చ॥ పిడుగులఁబోలుబాణముల భీమముగాఁగ నృపాలశేఖరుం
డడరిపదేనువైచెఁ గవచాభిహతిన్ వడి బిట్టమోఘమై
పుడమిఁబడెన్ మహోగ్రతను భూపతి క్రమ్మఱ భల్లసప్తకం
బుడుగనిచేవనేయ నవియుం దొరఁగెం గతశాతసంపదన్॥ 170

వ॥ అయ్యెడ॥ 171

క॥ శతకవచుఁ డుగ్రసాయక।వితతిన్ భూపాలుమౌర్వి విచ్ఛేదముగాఁ
గ్రతుభుక్సంఘము మెచ్చఁగ।నతులితగతినేసియార్చె నంబరమగలన్॥

వ॥ అంత శంతనుండు॥ 173

చ॥ చిటచిటవిస్ఫులింగములు చిందఁ బవందఁటలై కనుంగవన్
జొటజొటరాల వేఱొకటి శూరత నారినమర్చి వేగమే
పటుతరరుక్మపుంఖయుత భాస్వరసాయకతీవ్రపావక
స్ఫుటచటులప్రభాపటల పూరితసర్వదిగంతరాళుఁడై॥ 174

క॥ పదిపదులు నైదుపదులును। బదినూఱులు లక్ష కోటి పద్మానీక
ప్రదరములు మరల నేసినఁ।గడనంబున మొనలువిఱిగి ఖండములగుచున్

చ॥ అవియునునట్టె గాఢకవచాభిహతిం గడునక్క జంబుగాఁ
భువిఁబడియెం బదంపడి విభుండు శితార్ధశశాంక బాణముల్
జవమునఁదొంబదేయ నవి సర్వజనంబులు చిత్రమందఁగాఁ
బ్రవిమలరీతిఁ బ్రాలె రణరంగమునం దగఁ బూర్వవైఖరిన్॥ 176

వ॥ శంతనుండుమఱియును ననేక నిశితశరపరంపరలుఁగురిసిన ఛిన్నంబులై విపక్షక్షమాభృత్పక్షవిక్షోభంబుసేయ నేరక తద్దంభోళి కోట్యమోఘనిష్ఠురకవచాభిఘాతంబునఁ బ్రాలినం గనుంగొని చేయునది లేక దురంతచింతాక్రాంతస్వాంతుండై యిట్లనివితర్కించె॥ 177

ఉ॥ మాయయొ యింద్రజాలమొ సమాయతశాస్త్రవగర్వభేదనా
పాయమొ మంత్రసిద్ధియొకొ భావభవారివరప్రభావమో
స్థాయతర త్వగింద్రియపృథుస్థిరపాటవమొకొ భారతీ
నాయకకల్పితంబొ యిది నాకుఁదలంప నసాధ్యమెంతయున్॥ 178

శా॥ కల్పాంతాగ్నిసమానఘోరములు నిర్ఘాంతస్ఫురద్భీషణా
నల్పంబుల్ చటులాంతకప్రకటదండక్రూరముల్ భూరిసం
కల్పోద్భూతహరత్రిశూలనిశితాఖండంబు లస్మచ్ఛరం
బు ల్పొల్పొందఁగ వీనిఁదాకి పొడియై భూమిస్థలిన్ బ్రాలెడిన్॥ 179

ఉ॥ ఏమివిధంబునం గెలుతునీతని నుగ్రరణాంగణంబునం
దేమియుపాయమింక, మనుజేశ్వరమాత్రుఁడుగాఁడువీఁడు, సం
గ్రామమిఁకెట్లుచెల్లునొ శరప్రకరం బడరించి మన్భుజో
ద్దామపరాక్రమక్రమమడంగెను వైరివధం బిఁకెట్లొకో॥ 180

వ॥ అని తలంచుసమయంబున గగనభారతి యిట్లను "నిఖిలకవ
చనిర్భేదినియను శక్తి సురేంద్రదత్తంబై భవదధీనంబగుటం జేసి య
న్యశస్త్రాభేద్యంబులగు వీనికవచంబులు నూఱు నిమిషమాత్రంబునఁ
జూర్ణంబులగు, అంతటంబోలియు, దానిం బ్రయోగింపు"మని చెప్పి
యూరకుండె నంత శంతనుం డత్యంతకుపితస్వాంతుండై యమ్మహానీ
యశక్తి ప్రయోగించిన॥ 181

శంతనునిచేతిలో శతకవచుఁడు చచ్చుట.

క॥ అవిరళగతి సురలార్వఁగ। భువనము లాకులతఁజెంద భూరిస్ఫురణన్
రవికోటిసన్నిభోన్నతిఁ। గవచంబులునూఱు రజముగతిఁగావించెన్॥

వ॥ ఇవ్విధంబునఁ గవచంబులుచూర్ణంబులుచేసి యంతలోన॥

క॥ భగ్నస్వాంతుండై పతి। మగ్నంబై సర్వలోకమండలి తలఁకన్
భగ్నముగఁజేసె ఘననిశి। తాగ్నేయాస్త్రమునవిమతునరదంబెల్లన్

వ॥ ఇట్లు కవచస్యందనంబులు భగ్నంబులైన నతండు పక్షర
హితంబైన విహంగంబుకైవడి బలశౌర్యంబులడంగి పైకినేతెంచి గదా
దండంబువైచిన॥ 185

క॥ గదదునిమి వజ్రనిశిత। ప్రదరంబున దేవచయము ప్రస్తుతిసేయన్
గదనస్థలిఁ బడనఱకెను। ముదమారంగ శత్రుమూర్ధము వేగన్

వ॥ ఆసమయంబున॥ 187

• శంతనునికడకు నారదుఁడువచ్చుట •

సీ॥ ప్రాచేతసవ్యాసభట్టారకులకు నె
వ్వానిబుద్ధి ధరిత్రి వన్నె నెఱపెఁ
బుండరీకస్వాత్రిపాసఁగఁ జక్రికిఁ జక్రి
వరుఁడిచ్చు శిరము లెవ్వానిపాట
కౌత్తానపాది ప్రహ్లాదుఁ డెవ్వానిఁ గార
ణాచార్యవర్యుఁగా నాత్మఁదలఁతు
రెవ్వఁడు రాయంచనెక్కుడు తెఱగంటి
పెద్దకు ముదమిచ్చుముద్దుపట్టి
జగతినెవ్వఁడు వైష్ణవచక్రవర్తి
యెవఁడురుచిరాంగనిర్భర్జితేందుకుంద
శరశరన్నీరదుం డట్టిసారమౌని
నారదుఁడు సర్వవిద్యావిశారదుండు॥ 188

వ॥ పొడచూపిన నప్పుడమిఱేఁడు వినయభయభక్తితాత్పర్యం
బుల నమస్కరించి సుఖాసీనుం జేసిన నారదుండిట్లనియె॥ 189

క॥ "కోకారివంశపావన! । నీకబ్బెఁ విజయలక్ష్మి నిస్సీమగుణా
స్తోకత ధరణీమండల । మేకాతపవారణముగ నేలుము" మహిమన్॥

వ॥ ఇంక నృపతివధంబుడుగుము, "అహింసా పరమోధర్మ"
యను వచనంబెఱుంగవె" యనిపలుకునప్పలుకుచిలుకలకొలికిపటుపుకా
యనిపట్టికి రాజతిలకుండిట్లను "మహాత్మా! భవదాశీర్వచోవిశేషంబున
ననల్పసంకల్పసిద్ధుండనౌట కద్భుతంబేల, "రాజవధంబుడుగు" మనిపలి
కితిరి యప్పనికిసమ్మతించితి, మిమ్మునొక్కవిచిత్రంబడిగెద నానతిండు॥

క॥ శతకవచన్నృపతిసమర। క్షితిరంగమునన్ మదీయసితశరపాశా
హతినింతకుమునుకూలెను। శతధృతిముఖలేఖగణము సన్నుతిసేయన్॥

చ॥ అవిరళబాహుశౌర్యమహిమాతిశయంబున సస్త్రశస్త్రవై
భవమున దివ్యతేజమునఁ బార్థివకోటులు వీనిసాటియే
భువి నదిగాక శాత్రవసమూహముచే నిరపాయు మొందు నీ
కవచశతంబు మేననెటుగల్గెను దేవమునీంద్ర! తెల్పవే॥ 193

• నారదుఁడు శతకవచునిపూర్వవృత్తాంతము చెప్పుట. •

తే॥ అనిన నంభోజసంభవతనయుఁడనియెఁ
గుంభినీజంభభేది కుజ్జృంభమాణ
సారగంగాతరంగగంభీరభూరి
ఘుమఘుమారావమధుర వాగ్గుంభనమున॥ 194

క॥ అత్యంతసుందరంబై ప్రత్యక్షశ్రీవిలాసభాసితవిభవా
న్నత్యౌత్సుపరతంత్రా దిత్యంబై జగతి సాల్వదేశంబలరున్॥ 195

చ॥ కలదొకరాజధాని శశికాంతశిలామయనర్మహర్మ్యమం
డలవరకూటకోటిఘటితస్ఫుటికస్ఫుటదీధితిచ్ఛటా
కలితవిచిత్రవృత్రహరకాంచనసౌధమణిప్రభాళియై
విలసితసర్వసంపదల విశ్వధరిత్రిని శ్రీపురంబనన్॥ 196

క॥ ఆనగరంబేలెడిపృథివీనాథుఁడు ఘోరశత్రుతిమిరౌఘోద్య
ద్భానుఁడు శశ్వద్బాహాక్షీణపరాక్రముఁడు చంద్రశేఖరుఁడలరున్॥

సీ॥ రాజతాచలధామరమణీయధృతిగాంచి
వహిఁ సర్వమంగళావాసుఁడయ్యె
పుణ్యజనేశ్వరాగణ్యమైత్రివహించి
సకలలోకప్రియ సరణిగాంచె
అతులితానంతసాయకరూఢిఁ జెన్నారి
వరధర్మవిజయ సంభరత నెసఁగె

గరిమ మహేశ్వరఖ్యాతిచే, గన్పట్టి
కమనీయశుచిసమాఖ్యను జెలంగె
నవతరామిత్రపుర భేదనంబొనర్చి
విబుధవర్ణితసద్గుణవిఖ్యాతిగనియె
చంద్రశేఖరుఁడౌనని జనులువొగడఁ
జెలఁగె నిమ్మహి నా నృపశేఖరుండు॥ 198

ఉ॥ ఆతనికుద్భవించిరి హిమాచలధైర్యధురీణు లస్త్రవి
ద్యాతతనైపుణుల్ విమతదారుణభూరిపరాక్రమక్రముల్
వీతభయుల్ జయోన్నతులు విశ్రుతనిర్మలసాంద్రకీర్తిసం
జాతులు సాల్వుఁ డీతఁడును సర్వజగత్ప్రణుతప్రసిద్ధులై॥ 199

వ॥ ఇంతకుమున్నె కయ్యంబున నీచేతఁగూలినవాఁ డీశతకవ
చాగ్రజుండు సాల్వుండనువాఁడు సురాసురాభేద్యమానానూనదుర్వార
బాహాశౌర్యసంపన్నుండై తమతండ్రియనుమతంబున రాజ్యపాలనంబు
సేయుచుండె, శతకవచుండును ద్వాదశవత్సరంబులునిండినయనంతరంబ
తపంబుసేయువేడుకం జనిచని॥ 200

చ॥ కనియెన్నృపాలనందనుఁ డఘూతగభీరకనద్దరీఝరీ
ఘనతరఘోషభీషణవికస్వరతుంగతరంగసంభ్రమ
ద్వనగజరాజరాజినిబిడగ్రహాణాగ్రహవిగ్రహోన్నతా
వనతమదేభశత్రుకులవైభవచిత్రము పారియాత్రముఁ॥ 201

వ॥ అప్పర్వతోపకంఠంబునందు॥ 202

సీ॥ ద్విరదవిద్విడ్ద్వాత తీవ్రఘోషప్రతి
ఘోషిత దశహరిత్కుహరముఖము

కుహనాగహననాగ కోట్యుగ్రనిగ్రహ
చకిత నానామృగసంగతంబు
వాహద్విషచ్చమూ వాహప్రోత్సాహస
న్నాహధూర్వహచల న్మహితలంబు
స్ఖరరోమస్తోమ సాంద్రఘుర్ఘురరావ
కంపితానేక శాఖామృగంబు
స్వచ్ఛమధురసపానాల సాచ్ఛభల్ల
భల్లనఖముఖ నిర్దళద్బహుళ సాను
రంధ్రనిర్గత గూఢపాద్రటకుదార
హరిభుగావళియగు నరణ్యమును గనియె ॥ 203

వ॥ అందు 204

సీ॥ పాకాలపాండురా స్తోకాంగసుఖచక్ర
వాకాంగనాచయ శ్రీకరంబు
భేకాలిఘోషణా నీకాంబరోద్గతా
నేకార్భక బకౌఘనిరుపమంబు
నాళీకవిగళ న్మధూళీభ్రమద్భ్రమ
రాళీకలస్వనాభ్యంచితంబు
లోలీభవద్భంగ కేళీగత లసన్మ
రాళీషణీచక్రవాళయుతము
రంగదుత్తుంగ యజ్ఞాంగ తుంగనాగ
రంగ నారంగ కట్వాంగ లుంగ మాతు
లుంగక లవంగ సుకుడుంగ సంగతోరు
తీరమీక్షించె నెదుటఁ గాసారమొకటి॥ 205

వ॥ అమ్మహాసరోవరంబునందుఁ గ్రుంకి భూతిరుద్రాక్షమాలికాధరుండై యమనియమంబులుగలిగి స్వస్తికాసన పద్మాసన సిద్ధాసన మయూరాసన భద్రాసన కపాలాసనసింహాసన వీరాసనాది నానాసనంబుల మూలోడ్యాణ జాలంధరబంధంబుల సుస్థిరుండై యాధార స్వాధిష్ఠాన మణిపూరకానాహత విశుద్ధాది నానావిధచక్రానుగతంబైన ప్రాణాపానవ్యానోదానసమానాఖ్యలం బరఁగిన పంచానిలంబులఁ జంద్రసూర్యాగ్నిసంజ్ఞలం బరఁగిన యిడాపింగళాసుషుమ్నా నాడికోటరంబుల రేచక పూరక కుంభకంబులు సేయుచు వాయుజయంబుగలిగి నిర్మలంబును నిశ్చంచలంబును నైన చిత్తంబునఁ జిత్తజారాతి నారాధించుచుఁ బంచరాత్రంబుల కొక్కమాఱు బదరీఫల శ్రీఫలఫలాది వన్యఫలంబులు భక్షించుచు మాసంబుగడపి యంతటనుండి దశరాత్రంబుల కొక్కనాఁడు పత్రభక్షణంబు సేయుచు రెండవమాసం బుత్తరించి యంతటఁ బక్షంబునకొక్కమాఱు కరతలప్రమాణోదక పానంబు సేయుచు జఠరాగ్నినడంచి మూడవమాసంబుగడపి యంత నిరాహారుండై యచేతనంబైన కులధరంబుకరణి నిశ్చలుండై యుండె నాసమయంబున॥ 206

◆ గ్రీష్మర్తు వర్ణన ◆

క॥ ఉష్ణాగమ మెసఁగెన్ ధర
నుష్ణమయూఖోజ్జ్వలన్మయూఖపరిభవా
త్యుష్ణాప్తిగ జనమై మృగ
తృష్ణైకసమేధమాన తీవ్రస్ఫురణన్ ॥ 207

ఉ॥ కొన్ని దినంబులీవిధిని గొండొకఛద్మలిఖించి యంతటన్॥

---

శా॥ బ్రహ్మక్షత్రియవైశ్యశూద్రులను నీ వర్గంబులన్నాల్గిటిన్
బ్రాహ్మీయంబగు సృష్టి కాద్యమని యార్భాటంబుగాఁ జెప్పుచున్
బ్రహ్మక్షత్రియవైశ్యశూద్రవిధులన్ వర్ణింపఁగాలేని మీ
బ్రహ్మత్వం బభిధేయహీనమయి శూద్రప్రక్రియన్ గన్పడెన్॥ 80

ఉ॥ ఆదిజగన్మయుండగు మహాయాతతత్వమునన్ సమస్తలో
కోదయమైనకాలమునసుండియు భిన్నపథంబుఁద్రొక్కకే
ప్రోదిదనర్చి బ్రహ్మకులప్రాతులుగాఁదనరారుచున్న యా
యాదికులస్థులెవ్వరని యాత్మ దలంచకపోతి రెమ్మెయిన్॥

మ॥ నిగమాధీనులు నిర్మలాత్ములు జగన్నిర్మాణచాతుర్యధు
ర్యగరిష్ఠుల్ స్వకులానురంజనల సద్వ్యాపారధౌరేయు లీ
జగతిన్ బ్రహ్మకులస్థులెవ్వరన విశ్వబ్రాహ్మణుల్ గారె నే
బొగడంగాబనియేమి మాగురుని దాభూర్యన్వయంబేకదా॥ 82

ఆ॥ వాదభేద మొదవ వసుమతిఁగొందఱు। బ్రాహ్మణాఖ్య విదితపరపుచుండ
బ్రథమజాతి చూడ్కివగడఁగ విశ్వ। బ్రాహ్మణాఖ్యజెందె వీరియన్వయంబు॥ 83

శా॥ మీకున్ మాకు జగంబునందటికి సామీచీన్యమై యుత్తమ
శ్లోకంబై తగునన్వయం బిదికదా చూపట్టదేమీకు నీ
రాకాచంద్రికవోలుకీర్తిఁగల వీరబ్రహ్మమున్ జూడరే
మీకున్ సజ్జనభావమున్ గలుగదే మేలౌనె యిట్లాడఁగన్॥ 84

తే॥ చదివినందుకు నుత్తమజ్ఞానవృత్తిఁ గూర్ప లేకిట్టులాడుటకును మదీయ
మానసాబ్జము చింతతో మ్రందుచుండెఁ జెనటిమార్గంబు నెపు డభ్యసించినారొ॥85

శా॥ అజ్ఞుల్ మీరలు త్వద్వచఃప్రకరదృష్టాంతంబెకన్పట్టె మీ
యాజ్ఞాశీలురు మీరలున్ గలిసియేకాంతంబుగన్ సత్కళా
ప్రజ్ఞాసింధువు నిర్మలాత్ముఁడగు వీరబ్రహ్మమున్ జేరి స
ద్విజ్ఞప్తిన్ బొనరించిరేని సుగమాభిజ్ఞానమున్ బెంపగన్॥ 86

షరా:—ఇట్లు కల్యంధకౌముదిపేర నొకగ్రంథమే వ్రాయఁబడినది. దీన నింకను దురుసుగా బ్రాహ్మణనిందఁ జేయఁబడియున్నది.

నన్నుగుఱించి వ్రాసెను మనంబుననుండిన క్రోధమంతయుఁ
దిన్నగ వెళ్లఁగ్రక్కుచోక? తిట్టులవ్యాసము న్యాయవాదిపై

---

? 1908 సంవత్సరం, ఏప్రియల్, ప్రబోధిని

వితండపువాది; విరుద్ధపువ్యాజ్యము

......... నిరర్థక వాచాటుఁడును విద్యాగర్వదురహంకారియు నగు నొక మహాపురుషుఁడు గుంటూరుజిల్లా పల్నాడుతాలూకా జానపాటిగ్రామమున నేతగ్రామనామమే గృహనామమేర్పఱచుకొని పట్టాభిరామశాస్త్రినామమునఁ బ్రబలి యేవేవో కొన్నిచదువులుచదువుకొని తానుచదివినచదువునకుఁ బ్రయోజనము బ్రహ్మకులదూషణచేయుటయే సార్థకంబుగా నూహించి లోకనిందితకార్య మొకటి తలపెట్టెను అదియెద్దియన జానపాటిగ్రామములో గ్రామదేవతలుకొన్ని కలవు. వానినిబ్రతిష్ఠించుటకు నేతశాస్త్రివంశీయులచే ముందుగ యాజకత్వమొనర్చుకొని తరువాత వారిని సంకీర్ణసంకరజాతీయులని తెలుసుకొనికాఁబోలు నాగ్రామవాసులు విగ్రహములకు మూర్తిత్వము రాకున్నదని పూర్వయాజకుల యాజనాధికారమున కనర్హులగాఁ బరిత్యజించి,సకలదేవతాప్రతిష్ఠాపనార్హులును, వైదికబోధితులును, బ్రహ్మకులసంభూతులగు కొందఱివిశ్వబ్రాహ్మణులచేఁ బునస్సంప్రోక్షణచేయించి యథావిధిగా వారినిగౌరవించిరి. అదిచూచి యాశాస్త్రిగారోర్వలేక తాను సర్వకాలసర్వావస్థలయందు భైక్షుకజీవికుఁడును బరద్రవ్యాపేక్షకుఁడు నగుటచేఁ బ్రథమసంప్రోక్షణ నపహరించినద్రవ్యమువలె ద్వితీయసంప్రోక్షణయందుఁగూడ తనసంఘమునకు ద్రవ్యార్జన లభించలేదని విచారపడి ద్వితీయసంప్రోక్షణకర్తలగు విశ్వబ్రాహ్మణుల నిందితులని కొందఱికి దుర్బోధలొనర్చి వశపఱచుకొని గురిజాలసబుమేజస్ట్రీటుకోర్టులో వ్యాజ్యము తెచ్చెను. కాని తాను తెచ్చినయాక్షేపణములను దుదకు తానే సశాస్త్రీయముగ ధృవపఱచలేక, విదేశీయులగు శ్వేతముఖులనాకారమును బొందవలసివచ్చెను. తజ్జ్ఞులగు నాకోర్టువారును వ్యాజ్యమునుద్రోసివేసిరి. ప్రతివాదులైన విశ్వబ్రాహ్మణులును నిర్హేతుక వ్యాజ్యముఁదెచ్చిన యావ్యర్థవాదశాస్త్రిగారినిమాత్రము దయదలచి తమకైన మానసష్టమునకు దిరుగవ్యాజ్యము దేక యంతటితోవిడచిపెట్టిరి. ఆవిడచిపెట్టినకతమున నాశాస్త్రిగారల్లాకెక్కుడుఁదనపాండిత్యప్రకర్షనంతయు బ్రహ్మకులదూషణచేఁ బరిణమింపజేసుకొనవలెనని, యత్నించి ప్రకటనపత్రికనొకటి ప్రచురముచేసెను. దానివలననే యీవ్యర్థవాది పాండిత్యమున సర్వోత్కృష్టుఁడనని దురహంకారమూనినట్లు తోఁచఁగలదు.

రన్నిజవర్ణ్యులంద “అవురా”యనియాత్మలఁ బొంగిపొర్లఁగన్ ॥217

కులీనులగువిశ్వబ్రాహ్మణుల నగ్రజాతీయులుకారనియు, యాజనాధికారమున కనర్హులనియు వారినిబోకార్ప దుర్మతములబోకార్ప శంకరాచార్యులవతరించినట్లు తానవతరించెననియు, తనకెన్నాళ్ళనుండియో ఈవర్ణముమీఁద ద్వేషముండెననియు, ఏమేమో వినరాని కొన్నిదుష్ప్రసంగములఁ బ్రచురింపుచుఁ దుదకు నీవ్యాజ్యమునకు ద్రవ్యసహాయమొనర్పవలెనని తనకు పారంపరికముగావచ్చు భైక్షుకాచారమునకుఁదగినట్లు లోకులను వేఁడుకొనెను. అదియు బాగుగానేయున్నది. ఏదోయొక మిషవలన ద్రవ్యమార్జింపవలెనుగాని ప్రతిదినముజచ్చువారి కెవ్వరేడ్చెదరను లోకోక్తిననుసరించి ప్రతిదినముయాచించు పరపీడాధురంధరుల నెవ్వరుభరించెదరు? పాప మావ్యర్థవాదశాస్త్రిగారు పసితనమునుండి యభ్యసించిన విద్యాగరిష్ఠతచే లోకుల ననేకుల నాశ్రయించి ద్రవ్యమార్జించియు, గుక్షింభరత్వమునకుఁజాలమిచే నెవ్వియోకొన్ని వితండవాదములుప్రచురించిన నగ్రకులమునుగూర్చి యసూయపడుమానవులు కొందరైననుండరాయనియు నీమిషచేతఁ గొందఱయినద్రవ్యమొసంగరాయనియు నూహించెనుగాని, తానుజేయుమోసమునకు లోకు లెన్నాళ్లులోఁగెదరు? అయినను దుదకుఁ బ్రతిజ్ఞాభంగముచచ్చునని కాఁబోలు నీమధ్యకాలమున నర్సారావుపేటడిస్ట్రిక్టుకోర్టులోఁ బునస్సంప్రోక్షణవ్యయమునకు వ్యాజ్యమొకటిదెచ్చెను. ఇదియె వితండవాదితెచ్చిన విరుద్ధవ్యాజ్యము. ప్రస్తుతము విచారణలోనున్నది. విచారణవంతయు సక్రమముగా ముందుఁబ్రచురించుచున్నాము. వ్యాజ్యవిధానమెట్లుండినను వ్యాజ్యకర్తనుగూర్చి మాత్రము మేము ప్రశంసింప నుద్యమించితిమి. తమవిద్యావైభవమునంతయు వ్యర్థవాదములచేతను, పరనిందలచేతను, వెళ్ళబుచ్చు నోపట్టాభిరామశాస్త్రిగారూ! బాల్యాదారభ్య విద్యాభ్యాసమొనర్చినప్రతిఫల మిట్లుపరిణమించినదా? లేక సహజసిద్ధమా? వేదవేదాంగబోధితులై సానగాదిపంచవింశత్యుత్తరశతబ్రహ్మర్షిగోత్రజులగు విశ్వబ్రాహ్మణులనా తేమరు నిరాకరించుట, పూర్వమునిరాకరించిన కుంభసంభవాసురసింహాదులేమైరో స్ఫృహకుఁదెచ్చుకొనుడు. పండితజనైకవేద్యములగు వేదములఁబరికింపుడు. సర్వజనోపకారములగు నుపకరణములరచించి నాస్తికులనిరాకరించి, వేదశాస్త్రశిల్పాగమములచే నిర్ధారణచేయఁబడిన దేవతావిగ్రహనిర్మాణములనొనర్చి సమస్తమానవులకు నైహికాముష్మికములొసంగు మహాకులీనులకా యాజనాధికారములేదనుట.

తే॥ ఆ విరుద్ధపువ్యాసంబుతో విరాజి
లెడి ప్రబోధిని నాకంటబడియెనొకట
వ్యాజ్యెపుంబనిమీఁదనే యరిగినేను
నరసరాయనిపేటలోఁ దిరుగునప్పుడు॥ 218

తే॥ అదికనుంగొనినంత మదంతరంగ
బబ్జినీదళగతజలంబట్టులగుచు
ననుభవించుచుఁదాపంబు నధికముగను
గొంతవడి నేదితోఁపకే కూరుచుండి॥ 219

చ॥ పటుమతులైన ప్లీడరులపాలికిఁబోయి పఠించివ్యాసమే
నట"డిభమేపనుండునొకో"యంచడుగన్ విని"యుండులేదటం"
చటునిటుకానివా[illegible]గ నందులకుత్తరమిచ్చి యింకనొ
క్కటి యుపదేశమున్ సలుపఁగాఁ బ్రయతించిరివార లీవిధిన్ ॥ 220

ఉ॥ "హీనులతోడివాదముల కేఁగఁగరాదు భవాదృగుత్తముల్
దాన యశంబు వారలకె తప్పకచేకురు, మీఁదుకీర్తికిన్
హానిఘటిల్లు నెల్లపుడు వ్యాజ్యములాడుచు సంచరించుచో
మానముఁబూని యుండుటయ మంచిదియిట్లొయ్యెఁడనంచుఁ దోఁచె
[డిన్ ॥ 221

ఉ॥ పేపరులోనెతిట్టిరని పేరలుకన్ వహియింపఁబోకుఁడీ

---

సరే, కానిమ్ము తమపూర్వోత్తరముల దామేకనిపెట్టవలెను. ఆచరిత్రలన్నియు మాకుఁదెలియదనిమాత్ర మనుకొనకుఁడు. అమ్మపుట్టినిల్లు మేనమామయొద్దనా పొగడుకొనుట! నీవువిద్యాధికుడవుకావచ్చునుకాని, ఈపా నేసూయాదులవర్జించి, సత్యాసత్యములెఱిగించెడి జ్ఞానమొకటిమాత్రము తమకుశూన్యమని చెప్పఁదగియున్నది. పాపము "నూదిపోయినదని సోదెకుబోతే ప్రాతఅంకులు బైటపడేన,,న్నట్లు వ్యాజ్యఫలితమెట్లు పరిణమించునోకాని, తమపూర్వవృత్తాంతముమాత్రము వెల్లడికాగలదని మాత్రము నమ్ముడు. (అంతయు ముందుసంచికయందుఁ బ్రచురించుచున్నాము.)

(న్యాయవాది.)

పాపులు పెద్దపెద్దలనె పల్మఱు తిట్టిలిఖించుచుందు రీ
శాపము లేమిచేసెడిని,సత్యమెఱుంగనివారు లేరు,సం
తాపమునొందకీక్రియకుఁ దాల్మివహించుటయుక్త మారయన్"॥

ఉ॥ ఈకరణిన్ వచించునుడు లేవిని కార్యము నిర్ణయించుకో
లేకవసించుచుండుతఱి లీలమెయిం బులిపాకపూర్ణయా
ఖ్యాకునియింట రాయసమునన్వయమందునఁబుట్టినట్టి సు
శ్లోకుఁడు రంగయాహ్వయుఁడు చూచివచించెను నీవిధంబునన్ ॥

సీ॥ "పత్రికారాజంబె పరమతంబులనెల్లఁ
దూలుపాఱఁగఁబట్టఁదోఁచుపడెడు
పత్రికారాజంబె బహుదేశములనుండు
సంగతుల్ దెలుపంగ సాయపడెడు
పత్రికారాజంబె ప్రాచీనపుస్తక
ప్రకటనార్థంబయి పాటుపడెడు
పత్రికారాజంబె భాషాప్రపంచాభి
వృద్ధిగావింపంగ వీలుపడెడు
పత్రికారాజమిప్పట్లఁ బ్రజకుఁజాల
నుపకృతుల్ సేయఁగలదియై యుండెఁగాన
మీరునొకపత్రికం బెట్టి వారువ్రాయు
ప్రల్లదములెల్లనణఁచుట భావ్యమగును" ॥ 224

ఉ॥ నావిని పత్రికార్జనమునం దిగుకోర్కి జనించియుండనా
కీవిధమంతయుం దెలుప హెచ్చుముదంబునఁ బూర్ణయాఖ్యుతోఁ
"గేవల మీసదుద్యమము కీర్తికరంబగు"నంచు నా యశః
ప్రావరణుండు వల్కుటయుఁ బత్రికఁబెట్టఁగ నిశ్చయించితిన్ ॥ 225

ఉ॥ ఈవిధిమాసపత్రికగ నేఁబ్రచురింపను నిశ్చయించుకొం
చేవిఱొః నాడు గ్రంథములనే ప్రకటించుచునందు ముందుగాఁ

గేవల మీ కలాదజనకీర్తినె వెల్లడిచేయునట్టిదై
భావగభీరతఁ వెలయు?వ్యాసముకూడ నొకండు చేర్చితిఁ ॥ 226

---

? 1908 సం॥ జూను, అభినవసరస్వతి.

భరతఖండంబున రానురాను నాగరికతబలిసి పెక్కుఋమానవులు తత్తద్విద్యాకౌశల్యముంబడసి మహోన్నతపదము నధిష్ఠించుచు నిజకీర్తిచే విశదీకృతదిగంతరాళురై వర్తిల్లుచున్నవారు. ఇట్లు మనదేశమంతయు విద్వద్భూయిష్ఠమై విలసిల్లుచుండినను గించిజ్జ్ఞుఁడనగు నేన మహాపండితసాధ్యమగు నొకకార్యభరము నాఁదలఁ దాల్పవలసివచ్చె. తదుదంతమంతయు యథాక్రమంబుగ నెల్లరులకుం దెలుప నుపక్రమించుచున్న వాఁడను............దుగ్గిరాలాయనయొకఁడు బయలుదేరి స్వకులజాలనే కొందఱు సహాయులనేర్పరచుకొని "ప్రబోధిని,, యనుపేర నొక మాసపత్రికం బ్రకటింపసాఁగె. లోకములో నెందఱెన్నిపత్రికలఁ బ్రచురించుచుండలేదు? అవిఅన్నియును గొన్ని కేవల ప్రబంధప్రాచుర్యముతో నొప్పునవియును, గొన్ని ప్రవృత్తినివేదకములును గొన్ని ధర్మోపన్యాసబహుళములును నై సకలజనులచేతను గౌరవింపఁబడుచున్నయవి. ఈనూతనసృష్టయగు ప్రబోధినియైతేఁ గేవల స్వర్ణకారమాననీయయును రథకారస్తుతిపరయును నిందితభూదేవయును నై తదఘశాలేతరుల కేరికిం జదువ ననర్హయగుటయేకాక యనవసరముగాఁ దనకు మామూలులేని యకృత్యమునకుం జొరఁబడి యస్మదాదుల కొకకొంత నష్టముగలిగించినందుకై వ్యవహరించుచుండెడి నా దూషణములతో నిండియు నుండ జొచ్చె........యస్మద్విరచిత సంస్కృతాంధ్ర ప్రబంధములనేమి, ప్రాచీనకవిప్రణీతములనేమి, పురాణస్థములగు తత్తత్సర్వజనావశ్యంభావ్యవిషయములనేమి, ప్రచురించుచుండుటకయి యొకపత్రికను నిర్మింప యోజించుచున్న వాఁడను గానఁ దత్పత్రికయందే ఏతద్రథకారవిషయమైకూడఁ గొంతకాలమువఱకు కొంతవ్రాయనిచ్ఛగించి ప్రకృతము చాలినంతపోషకసమూహ మేర్పడకుండినను నన్ను స్వాస్థానవిద్వత్కవినిగా ననుగ్రహించిన శ్రీ శ్రీ జగద్గురు విరూపాక్షస్వాములవారి యాశ్రయప్రబలముచేతను, బండితపక్షపాతులును, సత్కార్యనిర్వాహకులును, సత్యవాదులును, నర్సరావుపేట డిస్ట్రిక్టుమునసబ్ కోర్టు ప్లీడరులును, నాకు బాల్యస్నేహితులు, నగు మహారాజశ్రీ పులిపాక పూర్ణయ్యపంతులు గారు గరిమముగా

ఉ॥ ప్రాథమికంబు సంచిక నపారముదం బొడఁగూర్చ నెందఱో
మాధురి కిచ్చమెచ్చి బహుమానముగా లిఖియించి *యుత్తరాల్

దమమిత్రులనేమి పోష్ట్లనేమి సహాయులఁగాను జందాదారులఁగాను జేయఁగలనని వాగ్దానముఁజేసి కొంత ప్రోత్సాహపఱచుటచేతను ప్రబంధప్రకటనాభిలాషంగాని కులాభిమానముతోఁ బాటుపడుదు మోయలేనిబరువునెత్తికొంటిమను దయాళుతంగాని కొందఱు బ్రహ్మక్షత్రియవైశ్యశూద్రులస్మత్పత్రికాబాలికప్రవృద్ధికై తోడుపడుదురనునమ్మకముచేతను మాపత్రికకీనెలలోనే ......"యభినవసరస్వతి"యను నామకరణముజేసితిమి.

---

* ప్రియమిత్రుఁడా!

కంభంపాడు.
15-8-08

......తమచే బ్రచురింపఁబడుచున్న "అభినవసరస్వతి"యను మాసపత్రిక ముట్టినది. అపరిమితానందభరితుఁడనైతి......బ్రహ్మద్వేషకులైన వడ్లకమ్మరబత్తులపై మీరు తెచ్చినదావాకు మిగులసంతసించినాఁడ......యీసంకరకులముయొక్క ప్రగల్భాలు యణచుటకు మీరుప్రయత్నించుచున్నారు గాన యిక్కడ నాస్నేహితులవల్ల కొంత చందావసూలుపర్చి తమకుపంపుటకు ప్రయత్నించుచున్నాను......

మంచిళ్ల నారాయణరావు.

---

మిత్రరత్నమా!

తుమ్మకోట
17-8-08

మీరుపంపిన "యభినవసరస్వతి"యను మాసపత్రిక నాకుచేరినది. దానిని కృతజ్ఞతాభివందనములతో నందుకొంటిని......మీరుచేయఁబూనిన యనన్యసామాన్యవిధ్యుక్తకార్యనిర్వహణంబునకుం దోడ్పడ నేనెంతయు నసమర్థుండనయ్యు మీకు నాయెడల గల స్నేహవాత్సల్యంబును, నాకుమీయందుగల గౌరవాతిశయమును మీరుయుద్యమించిన కార్యభారంబును దలంచి మీమాసపత్రికకు నేనొకచందాదారుగా నుండగోరుచున్నాఁడను.

సాధుత వెల్లడించుకొనసాఁగిరి,†తాండ్రనృసింహశాస్త్రి యెం
తే ధనలాభమాపనివిధించి గడించె యశంబు మెండుగన్ ॥ 227

సీ॥ స్వగ్రామమునయందు సభకూర్చి తొల్దొల్తఁ
జందాల్ వసూల్ చేసి స్వయమపంపె
అందందుఁగల సుహృద్బృందంబునకుఁజెప్పి
తగినచందాదారులుగనొనర్చె

---

మూర్ఖజనాళికోటపట్టనియెంచబడుచున్న మనపల్నాటిసీమయందుసహితము మీవంటిపండితోత్తములుండుటయు నిట్టివార్తాపత్రికలుబయలువెడలుటయు దేశాభిమానము, మతాభిమానము, వృద్ధిబొందుటయు మాచుటవలన నేను సంతోషసంభరిత హృదయారవిందుండనైతి, మీ క్షేమంబు దెలుపగోరెద.

ఇట్లు, ప్రియమిత్రుడు, శా॥ కృష్ణారావు.

† అయ్యా!

దుగ్గిరాల.
5-8-08.

యిప్పటికి షుమారు పదిమాసములనుండీ మాగ్రామకాపురస్థుడు......అగు వడ్డెపాటి నిరంజనం......ప్రబోధినిఅనుపేర నొకమాసపత్రిక ప్రకటనచేయను దానిలో నంతర్లాపికా బ్రాహ్మణదూషణ యుండియుండె......యీపత్రికలోనినిందార్థము తెలిసియు చేయునదిలేక తెలియనివానివలె నూరకుంటిని. నేటికి ......భవత్ విరచితపత్రికాలోకనమువలన మాగ్రామవిలేజిమునసఫుగారగు 1 జంపాల వెంకటసుబ్బారాయుడుగారున్నూ 2 వెనిగండ్ల వెంకటసుబ్బయ్యగారున్నూ 3 జంపాల సంగయ్యగారి అప్పయ్యగారున్నూ 4 మాగ్రామకరణంగారగు మ॥రా॥ చైనం రామమూర్తిపంతులుగారున్నూ అస్మదాదులము మరికొంతమందిన్ని, అపరిమితానంద భరితులమయినాము......యభినవసరస్వతికి నాయోపినకొలది అచ్చటచ్చట చందాదార్లనునిర్ణయించెద......అవకాశమున్నయెడల యొకపర్యాయము మాదుగ్గిరాలకు తామువిజయంచేసి తమవ్యక్తినికనుపరచి భవదీయవాక్ప్రౌఢిమధురకవితాలాపంబుల మమ్ముల సొమ్మసిలచేయవలయునని ప్రార్థించెద......

భవన్మిత్రుడు,
తాండ్ర నృసింహశాస్త్రి.

## ప్రధానపోషకులు.

1 శ్రీ శ్రీ జగద్గురు విరూపాక్షస్వాములవారు.

2 శ్రీ రాజా కోటగిరి వెంకటకృష్ణారావు బహదరు
జమీందారుగారు గంపలగూడెం

## పోషకులు.

1 శ్రీ రాజా నారయప్పారావు సింహాద్ర్యప్పారావు బహదరు
జమీందారులు, నూజివీడు

2 అల్లాడి లక్ష్మణరావుగారు కరణము జంగపల్లి

3 రామసింగుగారు నెల్లుట్ల పాపురపు సంస్థానము మానేజరు నెల్లుట్ల

4 రంగావఝ్ఝుల హనుమయ్యగారు జిల్లాకోర్టువకీలు గుంటూరు

5 తాడేపల్లి లక్ష్మీనరసింహారావుగారు మక్తాదారు చోల్లేరు

6 బీరకాయల రామారావు దేశముఖుగారు రాయగిరి

## సహాయులు.

1 అన్నమురాజు సుబ్బారావుగారు నంబూరు.

2 నంబూరు నరసింహారావుగారు, కరణం, నంబూరు.

3 నైషధము సీతాకాంతముగారు మోరంపూడి.

4 మెదకు శేషారావు దేశముఖుగారు, నల్లబల్లి.

5 పరాంకుశరావు దేశముఖుగారు, యాజారం.

6 కుప్పా శంకరశాస్త్రిగారు, చివలూరు.

7 గంభీరరావు దేశాయిగారు, లింగన్నపేట.

8 నారసింహారెడ్డి దేశాయిగారు, కాసరబాద.

9 కొండపల్లి అనంతరామయ్యగారు, వకీలు, జనగాం.

10 పిరాట్ల సీతాకాంతముగారు, చింతపల్లి.

11 కాకుమాను హనుమయ్యగారు, నర్సారావుపేట.

12 తంగెడ నరసింహారావుగారు, కరణం, మోర్జంపాడు.

13 వెలుగూరి పిచ్చయ్యగారు, కొదమగుండ్ల.

14 తుమురుగోటి నరసింహారావుగారు, తిరుమలగిరి.

15 గొల్లపూడి వేంకటసుబ్బారావుగారు, వాల్కాట్టుబ్రదర్సు, ఏజంటు.

16 దెందుకూరి బ్రహ్మాందీక్షితులుగారు గుంటూరు.

అభినవసరస్వతీ కార్యస్థానమున వెలకు దొరకు పుస్తకములు—

| | | | | | |
|---|---|---|---|---|---|
| 1 అళ్ళియాచార్యవిజయము | ... | ... | రు 0 | 4 | 0 |
| 2 కరిణీకోద్ధారిణి | ... | ... | 0 | 4 | 0 |
| 3 వాసంతికాపరిణయము | ఇవి నాటకములు. | | 0 | 4 | 0 |
| 4 కంసవధము | | | 0 | 8 | 0 |
| 5 చమత్కారమంజరి | ... | ... | 0 | 4 | 0 |
| 6 విరూపాక్షపీఠగురుపరంపర | .. | ... | 0 | 2 | 0 |
| 7 నీతిగీతలు (సుమతిశతకమునకు సంస్కృతము) | | | 0 | 2 | 0 |
| 8 వత్సల నీతిశతకము | ... | ... | 0 | 1 | 6 |
| 9 విశ్వబ్రాహ్మణశబ్దఖండనము | ... | ... | 0 | 2 | 0 |
| 10 అత్యద్భుతవిమర్శనము | ... | ... | 0 | 5 | 0 |
| 11 నరసరావుపేట శతావధానము (తిరుపతి వేంకటీయము) | | | 0 | 3 | 0 |
| 12 లక్ష్మీవిలాసము | ... | ... | 0 | 4 | 0 |
| 13 చిత్తూరుజిల్లా తీర్పువిమర్శనము | | ... | 0 | 4 | 0 |
| 14 పశ్యాంపుశ్యాం | ... | ... | 0 | 2 | 0 |
| 15 సంగదోషము | ... | ... | 0 | 3 | 0 |
| 16 షశ్యశబ్దవిచారము | ... | ... | 0 | 3 | 0 |
| 17 వీరభాగవతము | ... | ... | 1 | 4 | 0 |
| 18 పుళిందావివాహము | ... | ... | 0 | 4 | 0 |
| 19 గురిగింజ | ... | ... | 0 | 1 | 0 |
| 20 గుంటూరుసీమ, తిరుపతి వేంకటీయము | | ... | 1 | 0 | 0 |
| 21 నేమువరాగ్రహారశతావధానము | | ... | 0 | 12 | 0 |
| 22 పిష్టపేషణము | ... | ... | 0 | 1 | 0 |
| 23 న్యాసనిష్కాసనము | | ... | 0 | 1 | 0 |